# సనాతన సారథి

సత్య ధర్మ శాంతి ప్రేమల ద్వారా మానవజాతి సామాజిక నైతిక ఆధ్యాత్మిక అభివృద్ధికి అర్పితము

సంపుటము 40 నవంబర్ 1997 సంచిక 11

## విషయసూచిక



శ్రీ సత్యసాయి బుక్స్ అండ్ పబ్లికేషన్స్ ట్రస్టు, ప్రశాంతినిలయం

*సంవత్సర చందా: తెలుగు లేక ఇంగ్లీషు (ఒక్క సంవత్సరమునకు మాత్రమే స్వీకరింపబడును*

ఇండియాలో : రూ. 30/-

విదేశాలకు : ఎయిర్‌మెయిల్ - రూ.240/- లేక యు.ఎస్.డాలర్లు 8 లేక యు.కె. పౌండ్లు 5

సీ మెయిల్ - రూ.120/- లేక యు.ఎస్.డాలర్లు 4 లేక యు.కె. పౌండ్లు 3

చందా పంపవలసిన చిరునామా : *కన్వీనర్, శ్రీ సత్యసాయి బుక్స్ అండ్ పబ్లికేషన్స్ ట్రస్ట్,*
*ప్రశాంతినిలయం, అనంతపురం జిల్లా, ఆంధ్రప్రదేశ్, పిన్‌కోడ్ - 515134*

శ్రీ సత్యసాయి బుక్స్ అండ్ పబ్లికేషన్సు ట్రస్ట్, ప్రశాంతి నిలయం తరపున **కె.యస్. రాజన్** చే. శ్రీ సత్యసాయి బుక్స్ అండ్ పబ్లికేషన్స్ ప్రెస్ ప్రశాంతి నిలయము (పోస్టు), పిన్ **515 134**, అనంతపురం జిల్లా, ఆం.ప్ర. లో ముద్రింపబడి ప్రచురించబడినది.

సంపాదకులు : **వి.కె. నరసింహన్**

**సాధారణ సమాచారము:**

(1) చందాదారుని పేరు, పూర్తి చిరునామా పెద్ద అక్షరములతో వ్రాయవలెను.
(2) భారత దేశములో ఏ చోటకయినా పత్రిక చందా మనియార్డరు ద్వారాగాని, బ్యాంకు డ్రాఫ్టు ద్వారాగాని చెల్లించవచ్చును
(3) క్రొత్త చందాయో లేక రెన్యువల్ చందాయో తెలియపరచవలెను. రెన్యువల్ అయినచో ప్రస్తుత చందా నెంబరు వ్రాయవలెను
(4) రెన్యువల్ కోరునప్పుడు చందా గడువు ముగియుటకు రెండు నెలలు ముందుగా తిరిగి చందా రుసుమును పంపవలెను.

ఫ్యాక్స్ : 0091-8555-87236/87390. గ్రామ్స్ : 'బుక్‌టస్' టెలిఫోన్ : 87375. STD కోడ్ : 08555. ISD కోడ్ : 0091-8555

# సంకల్పం మంచిదైతే సాధ్యంకానిది లేదు

ప్రేమస్వరూపులారా!

ప్రాచీన కాలము నుండి భారతదేశం అన్ని దేశములకూ ఆధ్యాత్మిక సిరిసంపత్తులచేత సుస్థిర శాంతిభద్రతలు చేకూర్చుచూ వచ్చుచున్నది. కాలముచే మారక, చరిత్రచే మాయక, ప్రళయముచే తరగక, సృష్టిచే పెరగక ఏ సత్యమైతే ఉన్నదో ఆ సత్యస్వరూపమే భారతీయ సంస్కృతి. ఈ సంస్కృతి ప్రతిబింబమే సనాతన ధర్మము. ఈ సనాతన ధర్మం యొక్క బాహ్య స్వరూపమే నీతి. ఈ నీతిని ఆధారం చేసుకొనియే మానవుడు తన జాతిని పోషించుకుంటూ రావాలి. మానవజాతి నైతికంగా అభివృద్ధి చెందినప్పుడే సమానత్వము, సోదరత్వము, స్వేచ్ఛ అనే ఆదర్శాలు ఆచరణలోకి వస్తాయి.

## ప్రకృతి వనరుల దుర్వినియోగం తగదు

మానవాకారంకంటే అత్యంత విశాలమైనది ఈ సృష్టి. ఈ సృష్టి రహస్యాన్ని చక్కగా గుర్తించి వర్తించడమే మానవుని ప్రధాన కర్తవ్యం. తల్లిపాలను బిడ్డలు గ్రోలినట్లుగా, పూవులోని మకరందమును తుమ్మెదలు త్రాగినట్లుగా ప్రకృతిలోని సర్వ సంపదలను అనుభవించుటకు మానవునికి అధికార మున్నది. కానీ మానవుడు ఈ ప్రకృతి కేవలం తన ఉపభోగనిమిత్తమై ఏర్పడినదని భావించి ప్రకృతి వనరులను దుర్వినియోగపర్చుతున్నాడు. ఈ సృష్టి మానవుని ఉపభోగ నిమిత్తమై ఏర్పడినది కాదు. దీని వనరులను పరిమితమైన రీతిలో అనుభవించమని కోరాడు భగవంతుడు. కానీ మానవుడు దీనిని మితిమీరి అనుభవించడానికి ప్రయత్నిస్తున్నాడు. ఇదియే ఈనాడు సంభవిస్తున్న ఉప్పెనలు, కరువుకాటకములు, అతివృష్టి, అనావృష్టి మున్నగు ప్రకృతివైపరీత్యములకు మూలకారణమైనది. ఈ ప్రకృతి ఒక బ్యాలన్సుతో కూడినది. ఇది ఒక గ్లోబు. ఏ వైపున భారం ఎక్కువవుతుందో ఆ వైపుకు ఇది మరలుతుంది. మానవుడు ఈ ప్రకృతిలోని శక్తులను మితిమీరి అనుభవించడంచేత ఈ బ్యాలన్సు తప్పిపోతున్నది.

## హక్కు - కర్తవ్యం

ఈనాడు మానవుడు ప్రతి రంగమునందు హక్కు, హక్కు అని అఱ్ఱులు జాస్తున్నాడు. నిజంగా మానవునికి హక్కు అనేది లేనే లేదు. కర్తవ్యాన్ని చక్కగా నిర్వర్తించినప్పుడే హక్కు అనేది ఏర్పడుతుంది. వర్షము కురిసినప్పుడే వంకలు ప్రవహిస్తాయి. 'వర్షము నాకు అక్కర లేదు, వంకలు మాత్రం కావాలి' అంటే ఎలా వస్తాయి? వీలుకాదు. అదేవిధంగా మానవుడు తన కర్తవ్యాన్ని విస్మరించి హక్కు కోసమని పోరాడితే లభించేది ఏమీ లేదు. అశాంతియే లభిస్తుంది. ముఖ్యమంత్రి చెప్పినట్లుగా మనం ఏ పని చేసినా ప్రజలకు ఆదర్శవంతమైనదిగా ఉండాలి. అట్లు గాకుండా ఏదో పుట్టడం, తినడం, మరణించడం.... వీటికి మాత్రమే జీవితం పరిమితమైతే ఇంక మానవత్వమునకు విలువేమున్నది? ఈనాడు మనం పుణ్యఫలం కావాలని ఆశిస్తున్నాంకాని, పుణ్యకార్యములకు ముందంజ వేయటం లేదు;

పాపఫలము వద్దని వెనుకకు నెట్టుతున్నాము కాని, పాపకార్యములకు ముందంజ వేస్తున్నాము. మొట్టమొదట మనలో త్రికరణ శుద్ధి కలగాలి; దైవప్రీతి, పాపభీతి, సంఘనీతి మూడింటినీ చేర్చుకోవాలి.

ఒక్క త్రాగునీటి విషయంలో మాత్రమే కాదు, ప్రతి రంగమునందు మానవునికి అనేక సమస్యలుంటున్నాయి. పుట్టుక ఒక చింత, భూమినుండుట చింత, సంసారమొక చింత, చావు చింత... అన్నీ చింతలే! ఇంట్లో బిడ్డకు కల్యాణం చేయాలనుకుంటే అది కూడా ఎలా జరుగుతుందో ఏమిటో అని చింత ప్రారంభమవుతుంది. కనుక జీవితమే ఒక చింత. ''సర్వ చింతలు బాపెడి సర్వేశు కృపను పొందుడికనైన నరులార కోర్కెమీర....'' ఈ సర్వేశ్వరుని కృపను పొందితే సర్వచింతలు నివారణైపోతాయి.

## పురుషప్రయత్నం చేయాలి

'సాధనమున పనులు సమకూరు ధరలోన'. సాధన లేక ఏ పనీ మనం సాధించలేము. తట్టులోని పదార్థము పొట్టలోకి చేరాలంటే నోటికి, చేతికి పని పెట్టాలి కదా! కనుక మన కర్తవ్యకర్మలను మనం నిర్వర్తిస్తూపోవాలి. ప్రతి పనికి ప్రభుత్వంపైన, అధికారులపైన వత్తిడి పెట్టకూడదు. మనం చేయవలసింది మనం చేయాలి. ఈనాటి మానవునియందు ఇట్టి ఓపికగాని, దీక్షగాని కనిపించడం లేదు. దేనికి తగిన ప్రయత్నం దానికి చేయకుండా త్వరగా ఫలితం రావాలంటే ఎట్లా వస్తుంది? మన ప్రయత్నం మనం చేయాలి, దానికి కాలకర్మకారణకర్తవ్యాలు కూడా కలసి రావాలి. అసలు ప్రయత్నమే చేయకుండా అటు భగవంతునిపైనగాని, ఇటు ప్రభుత్వంపైనగాని నింద వేయడం మంచిది కాదు. భగవంతుడు ఏమైనా చేయగలడు. కాని ముందు మీకిచ్చిన శక్తిని మీరు సద్వినియోగపరచుకోవాలి. అప్పుడే భగవంతుడు మీకు తగిన ఫలితము నందించగలడు. మీ శక్తిని మీరు ఏమాత్రము ఉపయోగించకుండా అంతా భగవంతుడే చేయాలంటే ఏలాగు. పాపభీతి, దైవప్రీతి లేకుండా మీరు ఇష్టానుసారం ప్రవర్తిస్తుంటే దైవ మీకెట్లా అనుగ్రహిస్తాడు? మానవత్వమునే మరచిపోయి అహంకార ఆడంబర అసూయలను అభివృద్ధి చేసుకుంటూపోతే మీకు శాంతి ఏరీతిగా లభ్యమౌతుంది? హృదయంలో అహంకారము ఉంచుకొని శాంతి, శాంతి అని అరిస్తే శాంతి లభిస్తుందా? శాంతి రావాలంటే ముందు మన చుట్టూ ఉన్న వాతావరణమును పవిత్రమైనదిగా, ప్రశాంతమైనదిగా మార్చుకోవాలి.

ఒక గ్రామం అభివృద్ధిలోకి రావాలంటే ఆ గ్రామంలోని ప్రజలంతా ఏకమైతే ఎంతైనా చేయవచ్చు. కాని ఈనాడు కలి ప్రభావముచేత ఎవరు మంచి పనులు చేస్తున్నారో వారికి అనేక ఆటంకములు అడ్డు తగులుతుంటాయి. చిమ్మెట మీకు తెలుసు - పదివేల రూపాయల పట్టు చీరను కూడా మసిగుడ్డను కొట్టినట్లు కొట్టడం దాని స్వభావం. ఈ సమాజంలోను చిమ్మెటసంతతివారు, దోమసంతతివారు, నల్లిసంతతివారు కొంతమంది ఉంటారు. తాము చేయరు, చేసేవారిని చేయనివ్వరు, పైగా నిరుత్సాహం కల్గిస్తారు. మంచివారిని ఏదో ఒక విధంగా నిందించడం వారి స్వభావం. పోనీ వారేమైనా మంచి పని చేశారా, అంటే ఏమీ ఉండదు. అలాంటి వారికి అసలు విమర్శించే అధికారమే లేదు. ఎవరేమనుకున్నా ఫరవాలేదు, మనం చేసేది మంచి పని అనే విశ్వాసం మనకు దృఢంగా ఉన్నప్పుడు మనం ఎవ్వరికీ వెరువనవసరం లేదు. అదే ముఖ్యమంత్రికి చెప్పాను.

## త్యాగమే యోగం, భోగమే రోగం

ఈనాడు భారతదేశంలో నీటికొరకు బాధ పడేవారిని కోట్ల కొలది చూస్తున్నాము. మానవుల ప్రవర్తనలోని దోషమే దీనికి మూలకారణం. పూర్వం భారతీయులందరూ త్యాగానికి పట్టం కట్టారు, న్యాయానికి కంకణం తొడిగారు, ధర్మాన్ని అందల మెక్కించారు, సత్యాన్ని స్వాగతించారు. త్యాగం లేక జీవితంలో ఏమున్నది చెప్పండి. మనం పీల్చిన గాలిని తిరిగి విడిచిపెట్టకపోతే మన ఊపిరి తిత్తులు పాడైపోతాయి. తిన్న ఆహారాన్ని మరొకవైపున విసర్జించకపోతే పొట్ట చెడిపోతుంది. కాబట్టి త్యాగము మన కెంతో క్షేమం చేకూర్చు తున్నది. త్యాగమే యోగంగా రూపొందుతుంది, భోగమే రోగంగా మారుతుంది. కనుక ప్రతి మానవుడు తన శక్తి కొలది ఏదో కొంచెం త్యాగం చేసి తోటి మానవులకు తగిన సహాయం చేయాలి. ఎంతమందినో బాధ పడేవారిని చూస్తున్నాము, చూసి జాలిపడుతున్నాము. కానీ ప్రయోజన మేమిటి? జాలిని ఆచరణ రూపంలో నిరూపించి నప్పుడే అది సార్థకమవుతుంది.

## మనస్సులు మారాలి

ప్రేమస్వరూపులారా! ఈనాడిక్కడకు వచ్చిన మినిష్టర్లు హృదయానికి హత్తుకునేటట్లు మాట్లాడారు. ఇలాంటి మాటలను క్రియలో ప్రవేశపెట్టినప్పుడే మన మెంతైనా అభివృద్ధి పొందుతాము. మన ముఖ్యమంత్రి, కేంద్రమంత్రి, స్పీకరు వీరందరూ మీకు ఎంతో ఉత్సాహ ప్రోత్సాహముల నందించారు. వీటిని మీరు ఒక చెవితో విని మరొక చెవితో వదలిపెడితే ప్రయోజనం లేదు. ఇవి మీ హృదయంలో నాటుకొని పోవాలి, కార్యరూపం ధరించాలి. ఈనాడు భారతదేశమే కాదు, ప్రపంచమంతా సమస్యల తోరణంగా కనిపిస్తున్నది. కొన్ని కనిపించవచ్చు, కొన్ని కనిపించక పోవచ్చు. ఈ సమస్యలు పరిష్కారం కావాలంటే ముందు మానవుడు బాగుపడాలి. కేవలం శరీరం బాగుపడితే ప్రయోజనం లేదు, మనస్సులు మారాలి. హృదయాన్ని దయతో నింపుకోవాలి. ముఖ్యంగా ప్రేమను పెంచుకోవాలి. కాని ఈనాటి మానవుని ప్రేమ క్షణక్షణమునకూ మార్పు చెందుతున్నది. ''కూరిమి గల దినములలో నేరములెన్నైన కలుగ నేరవు, మరి ఆ కూరిమి విరసంబైన నేరములే దోచుచుండు....'' ఎదుటి వానితో నీవు స్నేహంగా ఉన్నప్పుడు అతడు ఏమి చేసినా నీకు మంచిగానే కనిపిస్తుంది. ఒకవేళ అతడు నిన్ను కొట్టినప్పటికీ, ''ఓహో! అతడు కొట్టడంవల్ల చాల మంచిదైంది. ఇంతకు ముందు ఇక్కడ నొప్పిగా ఉండినది. ఇప్పుడా నొప్పి పోయింది'' అని ఆనందిస్తావు. ఒకవేళ మీ ఇరువురి మధ్య ఏమైనా ద్వేషం ఏర్పడెనా, అతడు నీపై ఒక గులాబీ పుష్పం వేసినా, దాని ముల్లు నీకు గ్రుచ్చుకుపోవాలనే దురుద్దేశంతోనే అతడా పని చేశాడని భావిస్తావు. ఇది మానవుని బలహీనత. నిజమైన ప్రేమ ఎలాంటి పరిస్థితిలోను మారకూడదు. ఏదో ఒక్క విషయంలో భేదం వచ్చిందంటే అన్నింటినీ భేదదృష్టితో చూడడం మూర్ఖత్వం. ఇలాంటి మూర్ఖులే అభివృద్ధి కార్యక్రమాలకు అడ్డు పడుతుంటారు. ఇలాంటి వారికి భయపడి మన అభివృద్ధి కార్యక్రమాలను విరమించుకోవడం మంచిది కాదు. మనం చేయవలసింది చేసే తీరాలి; ఎన్ని కష్ట నష్టములనైనా ధైర్యంగా ఎదుర్కోవాలి.

## ప్రతివ్యక్తి శ్రమదానం చేయాలి

దివ్యాత్మ స్వరూపులారా! ఈనాడు ప్రశాంతి నిలయంలో యజ్ఞం సమాప్తి అయిన ఈ పవిత్ర

విజయదశమి దినమున మన మంచి నీటి పథక నిర్వహణ బాధ్యతను ముఖ్యమంత్రి స్వీకరించి ఏవిధమైన ఇబ్బందులూ లేకుండా నిర్వహిస్తానని మాట ఇవ్వడం జరిగింది. ఇంకా ముందుకు జరుగవలసిన కార్యక్రమము లెన్నో ఉంటున్నాయి. ఇవి నేను చెప్పను. నా కాలిగోరు మొదలుకొని తలవెంట్రుక వరకు ఉపకారమే, ఉపకారమే! ఇంకా ఎన్నో చేయాలని ఆశపడుతున్నాను. కానీ ఎవ్వరికీ చెప్పను, చెప్పకుండా చేయాలి. మన కర్ణాటక అసెంబ్లీ స్పీకరు చెప్పాడు - వారి ప్రాంతంలో కూడా మంచినీటి సమస్య అధికంగా ఉంటున్నది. మనకు కొన్ని నదులైనా ఉంటున్నాయి, కోలారువైపు ఏమీ లేవు. అక్కడ కూడా మంచినీటి కోసం ప్రజలు చాల ఇబ్బంది పడుతున్నారు. సమాజంలోని సమస్యలను తీర్చినప్పుడే మనం సమాజంలో పుట్టినందుకు జన్మ సార్థకమవుతుంది. మనలో మనం కమిటీలను ఏర్పర్చుకొని ప్రభుత్వంపైగాని, సంఘముపైగాని వత్తిడి తేకుండా సాధ్యమైనంత వరకు మన పనులను మనమే చేసుకోవాలి. ఏ పనీ లేక తిని, తిరిగి కాలం వ్యర్థం చేసే యువకులు అనేకమంది ఉంటున్నారు. ఇలాంటివారు సమాజ సంక్షేమ కార్యక్రమాలలో ప్రవేశించి శ్రమదానం చేయాలి. ముఖ్యమంత్రి చేస్తున్నాడు శ్రమదానం, ఆవిధంగా ప్రతి వ్యక్తి శ్రమదానం చేయాలి. మన గ్రామానికి రోడ్డు లేకపోతే మనకు మనమే వేసుకోవాలి. ఎవరో వచ్చి వేయాలని భావించకూడదు. మన గ్రామానికి మనం రోడ్డు వేసుకోవడంలో అగౌరవ మేమున్నది? మన గ్రామంలోని సమస్యలను మనంతట మనమే పరిష్కారం గావించుకోవడానికి ప్రయత్నించాలి. అలాంటి ప్రయత్నానికి వ్యయం అధికమైనప్పుడు ఇంకొకరు బాధ్యత తీసికోవచ్చు. నేనెప్పటికీ సిద్ధంగానే ఉంటున్నాను - ఏ గ్రామంవారైనా, ఏ స్టేట్‌వారైనా, ఏ జిల్లావారైనా సరే! నాకు జాతిమత భేదములుగాని, స్థాన భేదములుగాని లేనే లేవు.

## నాకు అందరూ ఒక్కటే

మీరు నమ్మినా నమ్మకపోయినా నాకు అందరూ ఒక్కటే. మానవత్వం, ప్రేమమతం, హృదయభాష - ఉన్నవి ఇవే! ఏ రాష్ట్రానికైనా, ఏ గ్రామానికైనా చేయడానికి నేనెప్పుడూ సిద్ధంగానే

ఉ

నుంటి కాదు, ఏది ఏమైనా సరే! ఈనాడు మీరందరూ ఇక్కడకు చేరారు - ఇంతేమైనా పెద్ద కార్యం చేయాలనుకుంటే, ఎవరైనా కానివారుంటే, ప్రశాంతినిలయానికైనా అమ్మి చేస్తాను పనులు. దానికి కూడా నేను సిద్ధమే! నాకు కావలసింది ప్రజాక్షేమమే, ప్రజల ఆనందమే, ప్రజలు దైవానుగ్రహానికి పాత్రులు కావడమే. దీనికే నేను పాటుపడుతున్నాను. ఈ సత్యాన్ని ఎవ్వరూ గుర్తించడం లేదు. ఎన్నో సంవత్సరముల నుండి చెంతనున్న వారు కూడా నా సత్యాన్ని గుర్తించడం లేదు. ఎట్లా అవుతుంది గుర్తించుకోవడానికి? సాధ్యం కాదు. దైవం యొక్క తత్త్వాన్ని, పవిత్రతను తెలుసుకోవడం చాల కష్టం.

మీరందరూ ఎవరికి తగిన శ్రమ వారు చేసుకుంటూ భగవద్విశ్వాసాన్ని పెంచుకొని మీ కార్యములను సాధించుకోవడానికి ప్రయత్నిస్తే ఏ అభ్యంతరములూ లేక అన్నీ సులభంగా జరిగిపోతాయి. పూర్వీకులంతా ఇదే మార్గాన్ని అనుసరిస్తూ వచ్చారు. ఆనాడు ఈ పార్టీ విభేదాలు కాని, ద్వేషాలుకాని ఈవిధమైన సమస్యలు లేనే లేవు. అందరూ ఏకమనస్సుతో ఉండేవారు.

మానవుడై పుట్టిన తరువాత ఒక ఆదర్శాన్ని నిరూపించాలి, తనకు ఇష్టం లేదని మంచిని కూడా చెడ్డగా మార్చుకోకూడదు. అది చాల పొరపాటు.

అలాంటివాడు మానవుడే కాదు. మన ముఖ్యమంత్రిగారు ఎన్నో కార్యాలు చేపడు తున్నారు. మనం మంచి చేస్తున్నప్పుడు ఎవ్వరికీ భయపడనక్కర లేదు, ధైర్య సాహసములతో ముందంజ వేయాలి. అయితే ముందు మనలో మంచితనమును పెంచుకోవాలి. ట్యాంకులో ఎలాంటి నీరుంటే ట్యాపులో అలాంటి నీరే వస్తుంది. కనుక మన హృదయమనే ట్యాంకు మంచిగా ఉన్నప్పుడు ఎవరేమి తలచినా మనకు భయం లేదు.

కేవలం అనంతపురం జిల్లా మాత్రమే కాదు, ముమ్ముందు ఇంకా వేరే జిల్లాలకుకూడా ఈసౌకర్యం కల్పించాలని ఆశిస్తున్నాను. ఒక్క విషయాన్ని మీరు గుర్తించాలి. భారతదేశంలోగాని, ఇంకే దేశమందుగాని మంచి కార్యం చేయాలనుకుంటే మనకేమీ తక్కువ లేదు, కావలసినంత ఉంటున్నది. కానీ ఆ మంచి సంకల్పమే రావటం లేదు. ఆ మంచి సంకల్పమే వస్తే మానవులు సాధించలేనిది లోకంలో ఏమీ లేదు. లక్షల మైళ్ళు అంతరిక్షానికి పోయేబుదులు అర ఇంచి హృదయాంతరాళంలోనికి పోకూడదా? కానీ ఇది మానవునికి సాధ్యం కావటం లేదు. మంచి మనస్సుతో ఏ కార్యం చేసినా, సందేహం లేదు, తప్పక విజయాన్ని సాధిస్తాము. ఈ వాటర్ ప్రాజెక్టును చేపట్టినప్పుడు మా ట్రస్టువారు, ''స్వామీ! ఇది బృహత్కార్యము, బ్యాంకులో ఏమీ లేదు, ఎట్లా జరుగుతుంది?'' అన్నారు. ''మీరేమీ అధైర్యపడవద్దు, నేను చూసుకుంటాను. మంచి కార్యం చేయడానికి సందేహించనవసరం లేదు, తప్పక జరిగిపోతుంది'' అన్నాను. అట్లాగే జరిగిపోయింది. ఏవిధమైన ఇబ్బందులూ లేవు. స్పీకర్ చెప్పినట్లుగా, పుట్టినది మొదలుకొని గిట్టునంతవరకు మానవునికి నీటితో ఎన్నో పనులుంటున్నాయి. నీటితోనే పుడుతున్నాము, నీటితోనే మరణిస్తున్నాము. నీరే ప్రాణము. ఇట్టి ప్రాణ సమానమైన నీరును అందరికీ అందించాలి. అదే నా సంకల్పం. మొట్టమొదటి నుండి నేను అనుకున్నాను. ప్రాచీనకాలము నుండి మన భారతదేశంలో విద్యను ఉచితంగా బోధిస్తూ వచ్చారు. ఆ కాలంలో గ్రామస్థులే ఉపాధ్యాయునికి తగిన అనుకూలాలు ఏర్పర్చి అతనివద్ద విద్యను అభ్యసిస్తూ వచ్చారు. మన ఇన్‌స్టిట్యూట్‌లో ఒక్క నయాపైసా ఖర్చు లేదు. మేము ఎవ్వరినీ ఏమీ అడగలేదు. అయితే టీచర్స్‌కి స్కేలు ప్రకారం జీతాలిస్తున్నాము. గవర్నమెంటు కూడా ఏమీ ఇవ్వటం లేదు, యథార్థం నేను చెబుతున్నాను. మేము అడుగలేదు. విద్య మేధస్సుకు, వైద్యం ఆరోగ్యానికి, జలము దేహానికి సంబంధించినవి. ఈ మూడింటినీ ఉచితంగా అందిస్తే జీవితమే సమాజానికి అంకితం చేసినట్లవుతుంది. ఇంతకంటే గొప్ప మహాభాగ్యం ఏముంది! కనుక విద్యను ఉచితంగా అందించుటకు ప్రయత్నం చేయండి. ఆరోగ్యానికి కావలసిన మందుల నిమిత్తమై బీదవారికి సహాయం చేయండి. ఇంక జలము విషయంలోను తగినరీతిలో పాటుపడండి. ఈనాడు కొన్నికొన్ని స్థానములలో సరియైన జలం చిక్కటం లేదు, రాయలసీమలో ఎక్కడ చూసినా ఫ్లోరైడు ఉంటున్నది. దీనివల్లనే తరతరములనుండి అనేకమంది కాళ్ళుచేతులు వంపులు తిరిగిపోయి దుర్భరమైన జీవితాన్ని గడుపుతున్నారు. జరిగినదేదో జరిగిపోయింది. కనీసం రాబోయే పిల్లలైనా ఆరోగ్యంగా, ఆనందంగా ఉండటానికి తగిన ప్రయత్నం చేస్తారని నేను ఆశిస్తూ, ఆశీర్వదిస్తూ నా దీర్ఘప్రసంగాన్ని విరమిస్తున్నాను.

*(తేది:11.10.97 మధ్యాహ్నం సాయికుల్వంత్ సభామండపంలో శ్రీవారు అనుగ్రహించిన దివ్యసందేశము నుండి)*

# శ్రీ సత్యసాయి సుజల పథకం 'అనంత' ప్రజలకు అంకితం

అనంతపురంజిల్లా దాహార్తి నివారణకై శ్రీ సాయి సెంట్రల్ ట్రస్టు 300 కోట్ల రూపాయల వ్యయంతో పూర్తి చేసిన రక్షిత మంచినీటి పథక నిర్వహణ బాధ్యతలను రాష్ట్రప్రభుత్వానికి లాంఛనంగా అప్పగించడం జరిగింది. విజయదశమినాడు మధ్యాహ్నం రెండున్నర గంటలకు సాయికుల్వంత్ సభామండపంలో జరిగిన ప్రత్యేక సమావేశంలో, భగవాన్ బాబావారి దివ్యసమక్షంలో, వేలాది భక్తుల హర్షధ్వానాల మధ్య శ్రీ సత్యసాయి సెంట్రల్ ట్రస్టు సభ్యుడు, సుప్రీంకోర్టు మాజీ ప్రధాన న్యాయమూర్తి జస్టిస్ పి.ఎన్. భగవతి వాటర్ ప్రాజెక్టు రిపోర్టును రాష్ట్రముఖ్యమంత్రి శ్రీ నారా చంద్రబాబునాయుడుగారికి అందజేశారు. ముఖ్యమంత్రి తోపాటు కేంద్రమంత్రి శ్రీ ఎర్రన్నాయుడు, కర్ణాటక అసెంబ్లీ స్పీకర్ శ్రీ రమేశ్ కుమార్, రాష్ట్రమంత్రులు శ్రీ నిమ్మల కిష్టప్ప, శ్రీ కోడెల శివప్రసాద్ తదితర ప్రముఖులు ఈ కార్యక్రమానికి హాజరయ్యారు.

విద్యార్థుల వేదమంత్రపఠనంతో సభ ప్రారంభమైనది. అనితరసాధ్యమైన ఈ మంచినీటి పథకాన్ని అతి తక్కువ వ్యవధిలో పూర్తిచేయడం కేవలం స్వామి సంకల్పబలంవల్లనే సాధ్యపడిందని జస్టిస్ పి.ఎన్. భగవతి తమ స్వాగతోపన్యాసంలోపేర్కొన్నారు. పలు అవాంతరాలను అధిగమించి ఈ ప్రాజెక్టును పూర్తి చేయడం జరిగిందని అన్నారు. దీని నిర్వహణ బాధ్యతను ఎంతో నమ్మకంతో రాష్ట్రప్రభుత్వానికి అప్పగిస్తున్నామనీ, దీనిని సక్రమంగా నిర్వహించి తమ విశ్వాసాన్ని నిలపాలనీ కోరారు. అనంతరం సెంట్రల్ ట్రస్టు కార్యదర్శి శ్రీ చక్రవర్తి ప్రాజెక్టుకు సంబంధించిన కొన్ని ముఖ్యాంశాలను స్థూలంగా వివరిస్తూ ఈవిధంగా అన్నారు.

దివ్యత్వ ప్రకటనకు కాదు, ఆదర్శ నిరూపణకే.

'ఈ దేశంలో మంచినీటి కొరత తీవ్రంగా ఉన్న సంగతి మాకు తెలిసి ఈ నేపథ్యంలో భగవాన్ బాబావారు 1994, నవంబర్ 22న అనాటి ప్రధానమంత్రి, ముఖ్యమంత్రుల సమక్షంలో దేశంలోని మంచినీటి కొరతను వివరించి, అవసరమైతే అనంతపురం జిల్లా దాహార్తి నివారణకు కావలసిన నిధులను తాము సమకూరుస్తామని ప్రకటించారు. సాయిసంకల్పం వజ్రసంకల్పం. అవతారమూర్తికి సకలైశ్వర్యములూ హస్తగతమై ఉంటాయన్న విషయం మీకు తెలిసిందే. అయితే లౌకికంగా, వ్యావహారికంగా ప్రజలకు ఆదర్శాన్ని నిరూపించడం అవతారమూర్తి లక్షణం. ఈ పథకమునకు 300 కోట్ల రూపాయల ఖర్చైనది. దీని నిమిత్తమై కెనరా బ్యాంక్ నుండి సుమారు 100 కోట్ల రూపాయల ఋణం కూడా తీసుకోవడం జరిగింది. ఇదిగాక ఎయిర్‌పోర్ట్‌ను అమ్మివేయడానికి కూడా నిశ్చయమైనది. ''మనస్యేకం వచస్యేకం కర్మణ్యేకం మహాత్మనాం'' ఇది స్వామివారి విషయంలో ముమ్మాటికి సత్యం.

ఈ పథకం చాల ప్రత్యేకమైనది. ప్రపంచంలో ఒక ఛారిటబుల్‌ట్రస్టువారిచే ఇంతటి భారీఎత్తున జరుప బడిన పథకం ఇది మాత్రమే. అతి త్వరగా పూర్తియైనది కూడా ఇది మాత్రమే. సాధారణంగా ఇలాంటి పథకాలలో కిలోమీటర్ మెయిన్ పైప్‌లైన్ ఏర్పాటుకు కనీసం ఒక వారం పడుతుంది. కానీ ఈ ప్రాజెక్టులో ఇది ఒకటిన్నర రోజులోనే జరిగింది. ఇది చాల అపూర్వమైన విషయం. ఈ ప్రాజెక్టు మూడు దశలలో జరిగింది. మొదటి దశలో ఆగస్టు, 95లో చిన్నచిన్న

నీటిపథకాలను పూర్తి చేసి ఆయా గ్రామ పంచాయతీలకు అందజేయడం జరిగింది. రెండవ దశలో సమగ్ర రక్షిత మంచి నీటి పథకాలను పూర్తి చేసి ఇంతవరకు ట్రస్టువారే వీటిని నడుపుతూ వచ్చారు. ఇంక మూడవ దశలో ఇప్పటికి భారీ పథకాలు పూర్తియైనవి. వాటిని రేనాడు రాష్ట్రప్రభుత్వానికి అప్పగిస్తున్నాము.

ఈ ప్రాజెక్టు నిర్మాణంలో పైపులను సేకరించడానికి **32** వేల లారీలు, **500** రైల్వే వేగన్లు వినియోగించబడినవి. ఇంతేగాక **55** వేలమంది కార్మికులు అహర్నిశలు శ్రమించారు. ఈ రకంగా ఈ జిల్లాలో చాలమందికి ఉపాధి కల్పించడం జరిగింది. చాలమంది భూస్వాములు వారివారి స్థలాలలో పైపులు వేయడానికి అనుమతించి సహకరించారు. స్వామివారు ప్రతి రోజు పని గురించి అడుగుతూ తగు సలహాలు, సూచనలు అందించారు. అన్ని గ్రామాలకు నీరు అందాలని పట్టుపట్టారు. స్వామివారు అపార కరుణతో అనుగ్రహించిన ఈ వరప్రసాదాన్ని సద్వినియోగ పర్చుకొని సంరక్షించుకోవడం మన కర్తవ్యం, మన ధర్మం. ఇదే మనం స్వామివారికి అందించవలసిన కృతజ్ఞత. స్వామివారి కీర్తి స్వయంప్రకాశము. దీనికొరకు యూనివర్శిటీకాని, లేక హాస్పిటల్‌కాని, లేక ఈ వాటర్ ప్రాజెక్టుకాని అవసరం లేదు. ఇది దివ్యత్వ ప్రకటనకు కాదు, మనలో సేవాభావాన్ని పెంపొందించడానికే! ఒక ఇంగ్లీష్ కవి చెప్పినట్లుగా ప్రతి అంతానికి ఒక ఆరంభమున్నది. ఈ నీటితో మన దాహార్తి తీసిరి రసస్వరూపుడైన భగవానునికోసం దప్పిక మొద లౌతుందని నేను అనుకొంటున్నాను''.

*సాంకేతిక వివరాలు:*

ఈ పథకానికి సంబంధించిన సాంకేతిక వివరాలను చీఫ్ ఇంజనీర్ శ్రీ కొండలరావు ఈ క్రింది విధంగా వివరించారు.

''మొట్టమొదట బోర్ బావుల ఆధారంగా రూపొందించిన **70** కోట్ల రూపాయల ప్రాజెక్టును చూసి భగవాన్ బాబావారు ఎంత ఖర్చైనా సరే, అందరికీ అన్నివేళల మంచినీటి సదుపాయం ఉండేటట్లు ప్రాజెక్టును సవరించమని ఆదేశించారు. స్వామివారి ఆదేశం మేరకు ప్రాజెక్టును మార్చడమైనది. మొట్టమొదట కేవలం గ్రామాలకు మాత్రమే ఉద్దేశించబడినప్పటికీ స్వామివారి అపారప్రేమాను రాగాలవల్ల అనంతపురం, ధర్మవరం, కదిరి, గుత్తి, ఉరవకొండ, కల్యాణదుర్గం, హిందూపురం తదితర పట్టణములకు, కృష్ణదేవరాయ యూనివర్సిటీ తదితర విద్యాసంస్థలకు కూడా మంచినీటి సౌకర్యం కల్పించబడింది. ఈ ప్రాజెక్టు సుమారు **731** గ్రామాలు, శివార్లు, పట్టణాలలోగల **9** లక్షల జనాభాకు నీటిసౌకర్యం కల్పిస్తోంది. ఉత్తరోత్రా **12.5** లక్షల జనాభాకు నీటి సౌకర్యం కల్గునట్లుగా డిజైన్ చేయబడింది. దీనిలోని ముఖ్యాంశాలు:

మొదటిది: చిత్రావతీ బ్యాలన్సింగ్ రిజర్వాయర్ బెడ్‌లో ఇన్‌ఫిల్టరేషన్ వెల్స్ వేసి రెండు భాగాలుగా మొత్తం **169** గ్రామాలకు నీరందించడం. దీనిలో మొట్టమొదటిది పెద్దకోట్ల నుండి ప్రశాంతి నిలయానికి వచ్చు **100** కి.మీ. పైపులైను. దీని నిమిత్తమై మద్దుల చెఱువు, అనంతసాగరం, ఎఱ్ఱకుంట్ల, కేశాపురం, మరియు సూపర్ స్పెషాలిటీ హాస్పిటల్‌వద్ద బూస్టర్ పంపింగ్ స్టేషన్లు ఏర్పాటు చేయడం జరిగింది. చిత్రావతిలో **4, 5** మీటర్ల వ్యాసం కల్గిన ఇన్‌ఫిల్టరేషన్ వెల్స్ వేసి ఎత్తైన కొండ మీద రిజర్వాయర్లను కట్టి పంపుచేసి తిరిగి గ్రావిటీ ద్వారా క్రింద నున్న గ్రామాలకు సరఫరా చేయడం జరుగుతోంది. ఈ పైప్‌లైన్‌ను ఎన్నో కొండలు, గుట్టల్లోంచి చాల కష్టపడి వేయవలసి వచ్చింది.

రెండవది: **57** కి.మీ. పొడవున్న చిన్నకోట్ల - కదిరి సెక్టరు. ఇది **78** గ్రామాలకు మంచినీటిని అందిస్తుంది. భవిష్యత్తులో కదిరి అవతల ఇంకా **150** గ్రామాలకు మంచినీటిని అందించుటకు వీలుగా ఇప్పుడే రెండు

పైప్‌లైన్లు కూడా వేయడం జరిగింది. వీంట్లో 400 హార్స్‌పవర్ కల్గిన పెద్దపెద్ద మోటార్లు, పంపుసెట్‌లు కూడా పెట్టడం జరిగింది. చిత్రావతి బ్యాలన్సింగ్ రిజర్వాయర్ పూర్తవుతుందన్న ఉద్దేశ్యంతో ఈ రెండు స్కీమ్‌లను డిజైన్ చేయడం జరిగింది. తుంగభద్ర కాలువలోని నీటిని నిలువ చేయడానికి వీలుగా పలుచోట్ల 170 మిలియన్ల నుండి 1700 మిలియన్ల లీటర్లను స్టోర్ చేసే కెపాసిటీ కల్గిన సమ్మర్ స్టోరేజి రిజర్వాయర్లను కట్టడం జరిగింది. ఫిల్టర్స్‌ను పెట్టి నీటిని శుభ్రపరచి పైపుల ద్వారా గ్రామాలకు సరఫరా చేయడం జరుగుతోంది. ఇవిగాకుండా వేరే సర్ఫేస్ వాటర్ లేనిచోట బోర్‌వెల్స్ ఆధారంగా 279 గ్రామాలకు ఇండివిజువల్ PWs స్కీమ్స్ ఇవ్వడం జరిగింది. ఎలక్ట్రిసిటీ లేని సమయాల్లో నీటి సరఫరాకు అంతరాయం కల్గకూడదనే ఉద్దేశ్యంతో కొన్ని ప్రదేశాల్లో 1000 కిలోవాట్స్ పవర్ కల్గిన డీజిల్ జనరేటర్ సెట్స్ కూడా పెట్టడం జరిగింది.

ఈ ప్రాజెక్టులో సుమారు 2500 కి.మీ. పైపులైన్లు, 400 స్టోరేజి రిజర్వాయర్లు కట్టడం జరిగింది. పెద్ద డయామీటరు కల్గిన AC పైపులను దేశంలోనే మొట్టమొదటిసారిగా వాడి పలు శ్రమల కోర్చి విజయం సాధించగల్గాము. ఈ ప్రాజెక్టు నిర్వహణకు అనంతపురం జిల్లాలో తొలిసారిగా శ్రీసత్యసాయి వాటర్ సప్లై ప్రాజెక్ట్ బోర్డును ప్రభుత్వం ఏర్పాటు చేయడం జరిగింది. తొమ్మిదిమంది సభ్యులుండే ఈ బోర్డుకు జిల్లా కలెక్టర్‌గారు చైర్మన్‌గా ఉంటారు. శ్రీ సత్యసాయి సెంట్రల్ ట్రస్టు నుండి కూడా ఒకరు సభ్యులుగా ఉంటారు.

ఈ ప్రాజెక్టును పూర్తి చేసి ప్రభుత్వానికి అప్పగిస్తున్న శుభసందర్భంలో - నామీద ఎంతో నమ్మకంతో ఇంత పెద్ద ప్రాజెక్టు పనిని నాకు అప్పగించినందులకు, మధ్యలో కష్టములు వచ్చినప్పుడు దయతో తగురీతిని దారి చూపినందులకు భగవాన్ బాబావారికి సర్వదా నా నమస్కృతులు, కృతజ్ఞతలు'' అని పలుకుతూ శ్రీ కొండలరావు తమ ప్రసంగాన్ని ముగించారు.

''కట్టించెడివాడు సాయి ప్రభువట...''

ఈ ప్రాజెక్టు నిర్మాణం పనులను చేపట్టిన లార్సెన్ అండ్ టుబ్రో సంస్థ అధినేత శ్రీ రామకృష్ణ మాట్లాడుతూ, నిరంతరం కరువుకాటకాలకు నిలయమైన అనంతపురం జిల్లా ప్రజలకు త్రాగు నీరందించు ప్రయత్నం భగవంతుని ప్రయత్నం వంటి శ్రేష్టతరమైనదని అభిప్రాయపడ్డారు. కేవలం భగవాన్ బాబావారి ఆశీస్సులవల్లనే ఎలాంటి అవాంతరాలూ లేకుండా పథకాన్ని పూర్తి చేయగల్గామని పలుకుతూ ఇలా అన్నారు: ''మా సంస్థ వివిధ రాష్ట్రాలలోని 260 ప్రదేశాలలోను, 9 విదేశాలలోను అనేక నిర్మాణం పనులు చేపట్టియున్నది. కాని ఇస్తంత ప్రశాంతి నిలయంలో జరిగినంత వేగంగా మరెక్కడా నిర్మాణాలు జరుగలేదు. దీనికి కారణం స్వామివారు అందించిన స్ఫూర్తి, సలహాలు, వారి మార్గదర్శకత్వము, అన్నింటికి మించి వారి ఆశీర్వచన బలము. నిర్దేశిత ప్రాంతాలకు నీటిని సప్లై చేయడానికి ఎత్తైన కొండలమీద, కొన్ని చోట్ల 300 అడుగులకుండే ఎత్తుమీద ట్యాంకులను నిర్మించడం జరిగింది. ఏడు సమ్మర్ స్టోరేజి ట్యాంకులు, 265 ఓవర్ హెడ్ రిజర్వాయర్లు ఒకే సంవత్సరంలో నిర్మించబడ్డాయి. మేము కొన్ని సంవత్సరాలలో చేయలేని నిర్మాణాలను స్వామివారు ఒక్క సంవత్సరంలో నిర్మింపచేశారు. ముఖ్యమైన నిర్మాణం పనులు సంవత్సర కాలంలో పూర్తి అయినప్పటికీ తీవ్ర వర్షపాతము, తుఫానులవల్ల 3, 4 నెలల వరకు పని కుంటుపడింది. స్వామిఆశీస్సులతో అన్ని అవాంతరాల నెదుర్కొని పని పూర్తి చేయగల్గాము. ఇటువంటి సంక్లిష్టమైన ప్రాజెక్టులో దుర్ఘటనలు జరుగుట సర్వ సాధారణము. కానీ స్వామివారి ఆశీర్వచనబలమువల్ల ఈ ప్రాజెక్టులో ఏ ప్రమాదమూ జరుగలేదు. ఇది ప్రజాసంక్షేమంకోసం భగవాన్ బాబా వారు చేపట్టిన బృహత్ పథకం కావడంచేత మా సంస్థ లాభాపేక

లేకుండా సెంట్రల్ ట్రస్టు మరియు పంచాయతీరాజ్ శాఖవారితో కలసి ఈ ప్రాజెక్టును తక్కువ వ్యయంతో పూర్తి చేయగల్గింది. ఇది స్వామివారికే సాధ్యం. మేమెన్ని పనులు చేసినా అన్నీ స్వామివారి కృపాకటాక్షములవల్లనే విజయవంతము అవుతున్నాయి. నాకనిపిస్తోంది. ''కర్టించెడివాడు సాయిప్రభువట, నే కర్టిన జయప్రద మగునట'' భగవాన్ బాబావారు ఇదే విధంగా ఇంకా ఎన్నో ప్రజోపకార కార్యక్రమాలను మాచే జయప్రదంగా చేయించాలనీ, వారి ప్రేమాశీస్సులు, మార్గదర్శకత్వము సదా మాకు ఉండాలనీ ప్రార్థిస్తున్నాను''.

## స్వార్థపరులకు కనువిప్పు సాయినీటి పథకం

కర్నాటక అసెంబ్లీ స్పీకర్ శ్రీ రమేశ్ కుమార్ మాట్లాడుతూ, ''ఈ ప్రపంచాన్ని సరియైన మార్గంలో నడిపించడానికి ఈ భూమిమీద అప్పుడప్పుడు భగవంతుడు అవతరిస్తూనే ఉంటాడు. స్వామివారు ఈ గడ్డన అవతరించినందుకు అనంతపురంజిల్లా ప్రజలు చాల అదృష్టవంతులు. త్రాగునీటి సమస్య దేశవ్యాప్తంగా అనేకమంది ప్రజలను బాధిస్తూనే ఉన్నది. స్వామివారిచ్చిన స్ఫూర్తితో మేము మా కోలార్‌జిల్లా లోని 85 గ్రామాలకు బోర్‌వెల్స్ ద్వారా నీటిసదుపాయం కల్పించడం జరిగింది. మిగిలిన 90 గ్రామాలకు నీటి సౌకర్యం కల్పించే బాధ్యత తమదని స్వామివారు మాకు హామీ ఇచ్చారు. ఈ అనంతపురం జిల్లా దాహార్తి తీర్చడానికి కెనరాబ్యాంకులో ఋణం కూడా తీసుకోవడం జరిగిందని ఇంతకుముందే చక్రవర్తి గారన్నారు. ఏ స్వామి దివ్యపాదాలకు మనను మనం అర్పణ చేసుకుంటున్నామో ఆ స్వామి మన త్రాగునీటికోసం బ్యాంకులో ఋణపడినారంటే - ఇది మనలాంటివారికి కనువిప్పు కల్గించడానికే అని నేనను కొంటున్నాను. స్వార్థంలో మ్రగ్గి పోతున్నవారికి దారి చూపడానికే వారు ఈ ప్రాజెక్టును చేపట్టారని నేను భావిస్తున్నాను. ''డబ్బు కూడబెట్టుకొని మీరేమి చేస్తారు? ప్రజాసంక్షేమంకోసం త్యాగం చేయండి'' అని కేవలం నోటితో చెప్పకుండా స్వామివారు స్వయంగా చేసి చూపించారు'' అని కొనియాడారు.

కేంద్ర గ్రామీణాభివృద్ధి శాఖామంత్రి శ్రీ ఎర్రన్నాయుడు మాట్లాడుతూ, 'భారత, రాష్ట్ర ప్రభుత్వాలు 50 సంవత్సరాల సుదీర్ఘ పరిపాలనలో చేయలేని విధంగా భగవాన్ బాబావారు అనంతపురం జిల్లాకు త్రాగునీటి సౌకర్యం కల్పించారు. మానవాళి మనుగడకోసం ఒక దృఢసంకల్పంతో బ్యాంకులో అప్పు కూడా చేసి ఈ బృహత్తర పథకాన్ని పూర్తి చేశారంటే - ఇది కేంద్రానికి, రాష్ట్రాలకు, ప్రతి వ్యక్తికి జ్ఞానోదయం కల్గించడానికేనని నేను భావిస్తున్నాను. ఇంతటి బృహత్తరమైన ఆశయంతో నిర్మింపబడిన ప్రాజెక్టును ఈనాడు రాష్ట్రప్రభుత్వం స్వీకరిస్తున్నది. అవసరమైతే - తప్పకుండా కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలు ఉమ్మడిగా ఈ ప్రాజెక్టుకు ఎట్టి ఇబ్బందులూ కల్గకుండా నిర్వ హిస్తాయని నేను భగవాన్ బాబావారికి ఈ సందర్భంగా మనవి జేసుకుంటున్నాను'' అన్నారు.

## సాయిమార్గం అందరికీ ఆదర్శం

రాష్ట్ర ముఖ్యమంత్రి శ్రీ నారాచంద్రబాబు నాయుడు తమ ప్రసంగాన్ని ప్రారంభిస్తూ ఈ కార్యక్రమంలో పాల్గొనడం తన పూర్వజన్మ సుకృతంగా భావిస్తున్నానని అన్నారు. ''భగవాన్ బాబావారి దర్శనం దొరికితేనే మనమెంతో తృప్తిపడే ఈ రోజుల్లో వారు చేపట్టిన ఈ ప్రాజెక్టును రాష్ట్రముఖ్యమంత్రిగా నా చేతులమీదుగా స్వీకరించడం తప్పకుండా నా పూర్వజన్మ సుకృతఫలమే అయివుంటుంది. ఈ రోజు ప్రశాంతి నిలయం ప్రపంచానికే ప్రధాన ఆధ్యాత్మిక కేంద్రంగా విరాజిల్లుతోంది. భగవాన్ బాబావారు జాతిమతకుల భేదాలను పారద్రోలి సమాజంలో మానవతా విలువలను పెంపొందిస్తూ మనలనందరినీ ముందుకు నడిపిస్తున్నారు. వారు అనేక కాలేజీలను, యూని వర్సిటీని, హాస్పిటల్స్‌ను స్థాపించారు. ఈనాడు ఎక్కడా

లేనటువంటి క్రమశిక్షణ, అంకితభావం ఈ సంస్థలలో మనకు కనిపిస్తున్నాయి. బయట మనం ఏదైనా మీటింగ్ పెట్టుకోవాలంటే ముందు పోలీసువాళ్ళు కనిపిస్తారు. ఇలాంటి రోజుల్లో భగవాన్ బాబావారు ఇక్కడ ప్రవేశించిన ప్రతివ్యక్తిలోను సంపూర్ణ ఆధ్యాత్మిక పరివర్తన తీసికొని వస్తున్నారు. బయటినుండి కొన్ని వేలమంది భక్తులు ఇక్కడికి వచ్చి అనేక స్వచ్ఛంద సేవాకార్యక్రమాలను చేపట్టడమే ఇందుకు ప్రత్యక్ష నిదర్శనం. మానవసేవే మాధవసేవ అని చెప్పడమేగాక చేసి చూపించి, మనతో చేయించి మనలో గొప్ప మార్పును తీసికొని వస్తున్న భగవాన్ బాబావారికి మనమెంతో ఋణపడియున్నాము. అపారమైన కరుణతో అనంతపురం జిల్లా దాహార్తిని తీర్చి కేంద్రరాష్ట్ర ప్రభుత్వాలు అనుకున్నా చేయలేని పనిని అనతికాలంలోనే చేసి చూపించారు. వారి ఆశీస్సులతోనే, ప్రేరణతోనే ఈ ప్రాజెక్టు జయప్రదమైనది. లేకపోతే ఇది అయ్యేపని కాదు. ఏ పవిత్రమైన భావంతో వారు ఈ ప్రాజెక్టును ప్రారంభించి పూర్తిచేశారో అదే అంకిత భావంతో రాష్ట్రప్రభుత్వం అన్నివిధాలుగా సహకరించి ఈ ప్రాజెక్టును జయప్రదం చేస్తుందని వారి సమక్షంలో ప్రతిజ్ఞ చేస్తున్నాను.

ఇంతకుముందు ట్రస్టుసభ్యుల్లో ఒకరు మాట్లాడుతూ, ఈ ప్రాజెక్టు నిమిత్తమై 100 కోట్ల రూపాయలు అప్పు చేయడం జరిగిందని అన్నారు. రమేశ్ కుమార్‌గారు ఈ విషయాన్ని చాల స్పష్టంగా వివరించారు. భగవాన్ బాబావారు సంకల్పిస్తే డబ్బుకు కొరత లేదు. అయితే ఒక పవిత్రమైన కార్యం చేసేటప్పుడు అది పదిమందికి ఆదర్శం కావాలనే సంకల్పంతోనే ఈవిధంగా చేశారని నేను భావిస్తున్నాను. ఉచిత విద్యా వైద్య సదుపాయముల ద్వారాను, ఈ మంచినీటి పథకం ద్వారాను మనందరికీ కనువిప్పు కల్గించారు. ఇదేవిధంగా మనం కూడా అంకితభావంతో పని చేస్తే సమాజంలో సమస్యలే ఉండవు. మనమందరము ఇక్కడికి శాంతిని కోరి వస్తున్నాము. భగవాన్ బాబావారిని చూసిన తరువాత నాకు కూడా మానసిక శాంతి కలిగి ముందుకుపోవడానికి అవకాశం కల్గుతోంది. ఏ కష్టం వచ్చినా, ఏ నిర్ణయం తీసుకోవాలన్నా రెండు నిమిషాలు వారిని మనస్సులో ధ్యానిస్తే తప్పకుండా ఆ పని జయప్రదమవుతుందని నేను విశ్వసిస్తున్నాను. సాయిసంస్థలో ప్రతి ఒక్కరు స్వచ్ఛందంగా శ్రమదానం చేస్తున్నారు. ఈ స్ఫూర్తితోనే నేను కూడా శ్రమదానం, జన్మభూమి కార్యక్రమాలను చేపట్టడం జరిగింది. వీటన్నిటికీ భగవాన్ బాబావారి ఆశీస్సులే కారణమని మీకు తెలియచేస్తున్నాను. మన మనస్సులో ఏముందో వారికి తెలుసు. అందుకని నేను వారిని ప్రత్యేకంగా ఏమీ కోరడం లేదు. నేను కోరేదల్లా ఒక్కటే - నాకు మంచి మనస్సివ్వమని, నేను కష్టపడి పని చేసేటట్లు, ఒక్క తప్పు కూడా చేయకుండా ఈ రాష్ట్రాన్ని ముందుకు నడిపించేటట్లు ఆశీర్వదించమనీ కోరుతున్నాను. వారి ఆశీస్సులతో నేను తప్పకుండా ముందుకు పోగలననే నమ్మకం నాకున్నది. స్వామివారు అనుకుంటే అన్నీ సాధ్యమవుతాయి. మనమంతా నిమిత్తమాత్రులం. అయితే మన కర్తవ్యాన్ని మాత్రం మనం నిర్వర్తించాలి. అప్పుడు స్వామివారి ఆశీస్సులు మనపై తప్పక ఉంటాయి అని పలుకుతూ ముఖ్యమంత్రిగారు తమ ప్రసంగాన్ని ముగించారు.

కార్యక్రమంలో చివరిగా శ్రీ సత్యసాయి సెంట్రల్ ట్రస్టు సభ్యులు శ్రీ వి. శ్రీనివాసన్ సాయినీటి పథక నిర్మాణంలో అవసరమైన వస్తుసామగ్రిపై సేల్స్‌ట్యాక్సు మినహాయించి సహకరించిన కేంద్ర ప్రభుత్వానికి, వివిధ రాష్ట్ర ప్రభుత్వాలకు, L & T సంస్థకు, ఇంజనీర్లకు, కాంట్రాక్టర్లకు, సబ్-కాంట్రాక్టర్లకు, అహర్నిశలు శ్రమించి పనిచేసిన వేలాది కార్మికులకు ట్రస్టు తరఫున కృతజ్ఞతలు తెల్పుకొన్నారు. జాతీయగీతాలాపనతో కార్యక్రమం ముగిసింది.

(శ్రీవారు ఈ సందర్భంగా అనుగ్రహించిన దివ్యసందేశం ఈ సంచికలోనే ప్రత్యేకంగా ప్రచురింపబడింది.)

# వేదపురుష సప్తాహ జ్ఞానయజ్ఞ రహస్యం

భగవాన్ శ్రీశ్రీశ్రీ సత్యసాయిబాబావారు ప్రశాంతినిలయంలో **1962**వ సంవత్సరం మొదలుకొని దసరా రోజులలో విశిష్టమైన వేదపురుషసప్తాహజ్ఞానయజ్ఞాన్ని లోకకళ్యాణం కొరకు, ప్రజాక్షేమానికి, ధార్మిక ఆధ్యాత్మి కాభివృద్ధికి జరుపుచూ వస్తున్నారు. ఇట్టి యజ్ఞం ఈ మధ్య అక్టోబరు **5**వ తేది నుంచి **11** వరకు బాబావారి సంపూర్ణాధ్యక్షతతో, ఆశీస్సులతో - దేశవిదేశాల నుండి వచ్చిన వేలాది భక్తుల సమక్షంలో పూర్ణచంద్ర సభామండపంలో అతివైభవంగా జరిగినది.

### సప్తాహరహస్యం

యః + జ్ఞ కలిస్తే యజ్ఞ పదమగును. భగవంతుని తెలిసికొను సాధనయే యజ్ఞం. యజ్ఞం మంత్రానుబంధం, దైవానుబంధం, త్యాగానుబంధం కాబట్టి వేద విహిత త్యాగం ద్వారా దైవాన్వేషణ వారం రోజులపాటు చేస్తే శ్రేయోఫలం, జ్ఞానఫలం చేకూరును. అయితే వారం రోజులపాటు ఎందుకు చేయాలి? భగవంతుని దివ్యసృష్టిశక్తికి ఏడవసంఖ్య ప్రతీకగా యుంటుంది. ఉదా: సప్తలోకాలు, సప్తమహర్షులు, సప్తసముద్రాలు, సప్తపర్వతాలు, సప్తరంగులు, సప్తస్వరాలు, సప్తప్రాణధాతువులు సప్తదేవతాశక్తులు మొదలగునవి. వాటిని శాఖాచంద్రన్యాయంగా ఆరాధిస్తే ఆ సృష్టి వైచిత్ర్యం ద్వారా సృష్టికర్తను తెలిసికొనవచ్చును. యజ్ఞ యాగాదులకు వారంరోజులు దీక్ష వహించడం వేదంలో అశ్వమేధ క్రతుసందర్భంగా చెప్పబడినది. అదే విధంగా పురుషసూక్తంలో దేవతలు విరాట్పురుషుని గూర్చి మానసికంగా యజ్ఞం చేశారని ఉంది. ''సప్తాస్యాసన్ పరిధయః'' ఏడు పరిధులు కాలగతికి, కాలస్వరూపానికి ప్రతీకలు. ఈ ఏడు రోజులపాటు జరిగే యజ్ఞకాలంలో ఏడు అజ్ఞానపు తెరలను తొలగించి సప్తజ్ఞాన భూమికలను అవరోహించి మోక్షమును పొందు సామర్థ్యము కలుగునని తాత్పర్యం.

### యజ్ఞప్రారంభం

యజ్ఞప్రారంభానికి ముందుగా వేదపండితులు పుణ్యాహవాచనం స్వస్తి మంత్రపఠనం చేసి, వరణస్వీకారం - అంటే యజ్ఞకర్మను చేయు దీక్షను వహిస్తారు. వేదపురోహితులు పసుపురంగువస్త్రాలు ధరించి మంగళవాద్యాలతో ఊరేగింపుగా, విద్యార్థుల వేదఘోషతో, దివ్యమంగళమూర్తి శ్రీ సత్యసాయి మధ్య నడువగా ప్రశాంతి మందిరాన్నుంచి పూర్ణచంద్ర వేదికపైకి వస్తారు.

ఈ యజ్ఞం అగ్నిస్థాపనతో ఆరంభింపబడుతుంది. యజ్ఞపురోహితులు రెండు చేవ కర్రముక్కలను వేగంగా రాపిడి చేసినప్పుడు సహజంగా యజ్ఞాగ్ని ప్రజ్వలిస్తుంది. తిలలలో తైలంవలె, పాలలో నెయ్యివలె, కర్రలో అగ్నివలె, దివ్యత్వం అన్నింటిలోను నిబిడీకృతంగా ఉందంటారు బాబా. అంతర్ దృష్టితో అంతర్మథనం గావిస్తే హృదయంలో జ్ఞానజ్యోతి వెలుగునని బాబావారు చెప్తూయుంటారు.

ఈ యజ్ఞంలో ముఖ్యంగా గణేశ, సూర్య, దేవీ, విష్ణు, శివ, శక్తుల పూజలతోబాటు, వేదపారాయణద్వారా చతుర్ముఖ బ్రహ్మను

హవనరూపంలో అగ్నిదేవుని మొత్తం ఏమి దేవతాశక్తుల ఆరాధన జరుగుతుంది. ఈ శక్తులన్నీ మనలో అంతర్గతంగా ఉంటాయని బాబావారు చెప్తూయుంటారు.

వినాయక ఆరాధన

ఈ యజ్ఞంలో ప్రతి భాగాన్ని ప్రారంభించేటపుడు విఘ్నేశ్వర ఆరాధన జరుగును. దీనివలన యజ్ఞకర్మలు నిర్విఘ్నంగా జరిగి ఫలసిద్ధి కలుగును. గణపతి మూలాధార చక్రాధిష్ఠానదేవత, ప్రణవస్వరూపుడు. విద్యా, మేధా, బుద్ధి, సిద్ధి ప్రదాయకుడు. మన దృఢ సంకల్పశక్తియే గణపతి దేవతాకం.

సూర్యారాధన

సూర్యదేవతారాధన ఈ యజ్ఞంలో రెండో అంగం. అరుణ మంత్రాలతో సూర్యదేవునికి సాష్టాంగనమస్కారపూర్వకంగా పూజ జరుగును. ఈ సూర్యశక్తియే మన ప్రాణశక్తి. సూర్యుడు సప్తకిరణుడు, గ్రహాధిపతి, ఆయురారోగ్యప్రదాత. అందుచే, ''ఆరోగ్యం భాస్కరాదిచ్ఛేత్'' అన్నారు. మనం ఆరాధించేది ప్రత్యక్షంగా కనిపించే సూర్యబింబాన్ని కాదు. ఆ సూర్యమండలాంతర్గత మధ్యవర్తి అయిన సూర్యనారాయణునే పూజించాలి.

దేవీ ఆరాధన

ఈ యజ్ఞంలో మూడవ అంగం దేవీపూజ. ఆమె పరమేశ్వరి, చిత్స్వరూపిణి, మాయా స్వరూపిణి, మూలప్రకృతి, మాతృస్వరూపిణి. ''యాదేవీసర్వభూతేషు మాతృరూపేణ సంస్థితా'' అని చండీసప్తశతిలో ఉంది. ఆమె ప్రేమస్వరూపిణి. ఆ ప్రేమయే జగద్వ్యాపారానికి పునాది. అందుచే మాతృదేవతను ఏడు రకాలుగా ప్రేమించి పూజించాలి. అదేమిటంటే, దేహమాత, భూమాత, గోమాత, వేదమాత, దేశమాత, లోకమాత, సాయిమాత! ఈ యజ్ఞంలో పరమేశ్వరిని లలితాసహస్రనామ పూజలతోను, రాక్షసప్రవృత్తులను హతమార్చిన మహాకాళి, మహాలక్ష్మి, మహా సరస్వతులను ఉద్దేశించి పారాయణద్వారాను; మూలప్రకృతి, మహామాయా, మహాశక్తి తత్త్వాలను వేదవ్యాసమహర్షి రచించిన దేవీభాగవత పురాణ పారాయణద్వారాను ఆరాధన జరుగును. దీనివలన మనలోని పశుభావాలు, రాక్షస ప్రవృత్తులు, కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యాది గుణాలు నిర్మూలన గావింపబడును. ఆ జగజ్జనని మనలోని సుప్త అజ్ఞాన, మాయా పటలాలను తొలగించిన తరువాతనే మనకు ఈశ్వర సాక్షాత్కారం లభ్యమగును.

విష్ణ్వారాధన

ఈయజ్ఞంలో వైష్ణవశక్తి యొక్క ఆరాధన వేదవ్యాసమహర్షి రచించిన మహాభాగవత పురాణ పారాయణ ద్వారా జరుగును. యజ్ఞం విష్ణు స్వరూపం. ''విశ్వం విష్ణుర్వషట్కారో భూత భవ్యభవత్ప్రభుః'' అని విష్ణు సహస్రనామ వాక్యం. విష్ణువు సర్వవ్యాపి, సర్వపోషకుడు, సర్వరక్షకుడు. పురుషసూక్తంలో ఆ విరాట్పురుషుని త్యాగశక్తి మంత్రరూపంలో తెలియుచున్నది. భాగవతంలో భక్తి, భగవంతుడు, భాగవతులను గూర్చి వివరణ యుంటుంది. శుకమహర్షి చెప్పిన భాగవతాన్ని పరీక్షిత్తు ఏడురోజులు దీక్షతో విని భక్తి, జ్ఞాన, వైరాగ్య, మోక్ష ఫలాన్ని పొందాడు.

విష్ణ్వవతారాలలో మానవులకు అత్యంత ఆదర్శంగా యున్న రామచరిత్ర, ఈ యజ్ఞంలో వాల్మీకి రామాయణ పారాయణ ద్వారా అవలోకన అగుచున్నది. ''వేదాః సాక్షాత్ రామాయణాత్మనా''. రామాయణం వేదధర్మ సారం ''రామో విగ్రహవాన్ ధర్మః'' అని

రావణుడే రాముని ప్రశంసించాడు. ఈసారి యజ్ఞంలో సుందర కాండపారాయణ కూడా జరిగినది. స్వామి చెప్తూయుంటారు : హనుమంతుడు గుణవంతుడు, బలవంతుడు, బుద్ధిమంతుడు. అతని రోమరోమాల లోను రామనామం ప్రతిధ్వనిస్తూ యుంటుంది. అట్టి భక్తాగ్రేసరుడైన హనుమంతుడు సుందర సీతామాతను కనుగొన్న వృత్తాంతం వాల్మీకి బహుసుందరంగా వర్ణించిన ఘట్టం ఈ సుందరకాండలో ప్రాధాన్యత వహించినది.

*శివారాధన*

ఈ మహాయజ్ఞంలో కేంద్ర బిందువు శివారాధన. ఇది సహస్రలింగార్చన ద్వారాను ముఖ్యంగా శతరుద్రీయ సంహితలోని శివనామాలతో హోమప్రక్రియద్వారాను జరుగును. జాజ్వల్యమానమైన అగ్నికుండంలో ఋత్విక్కులు సప్తజిహ్వుడైన అగ్నిదేవునిద్వారా నేతిధారలను, హవిస్సులను శివునికి అర్పిస్తారు. ఈ యజ్ఞ పరిసమాప్తి రోజున జరుగు పూర్ణాహుతి సందర్భంగా ఎన్నో యజ్ఞద్రవ్యాలను, బాబావారు సృష్టించిన వస్తుసముదాయాన్ని అగ్నికుండంలో హోమం చేస్తారు. మనలోని అంతులేని ఆశలను, అహంకారమమకారాలను శివునికి సమర్పించి ఆత్మనివేదన చేయుటయే ఈ పూర్ణాహుతి అంతరార్థమని బాబావారు బోధిస్తూయుంటారు. ఈ పవిత్ర హోమధూమం వర్షపుమేఘాలను పుట్టించి, వర్షాలద్వారా పంటలను వృద్ధి చేయునని, వాతావరణంలోని విషవాయువులను, కాలుష్యాన్ని పారద్రోలునని బాబావారు చెప్తూయుంటారు.

ఈ యజ్ఞంలో శివపూజకు ఎందుకు ప్రాధాన్యమంటే, రుద్రజపహోమాదులద్వారానే సర్వులకు భుక్తి ముక్తులు లభిస్తాయి అని ఉంది. ''రుద్రజపాదేవ భుక్తి, ముక్తి ప్రసిద్ధ్యతః'' ఇంకా, ''జ్ఞానం మహేశ్వరాధిచ్ఛేత్'' అనీ, ఈశ్వరకృప, అనుగ్రహంద్వారా ''ఈశ్వరానుగ్రహాదేవ పుంసాం అద్వైత వాసనా'' అనీ స్మృతులు చెప్పుచున్నవి. అద్వైతజ్ఞానోదయం అగునని ఈ వాక్యాల అర్థం. సాయిశివావతారుడు. ''సాయిశివోఽహం'' అనే పంచాక్షరీమంత్రం అద్వైత బోధకం!

*వేదపురుష ఆరాధన*

సృష్టికర్త అయిన బ్రహ్మదేవుని ఆరాధన ఈ యజ్ఞంలో వేదపారాయణద్వారా జరుగును. వేదం చతుర్ముఖ బ్రహ్మద్వారా బయల్వెడలినది. వేదం సృష్టి చేయుటకు ఉపకరించు మంత్రరాశి. ఇదియే శబ్దబ్రహ్మ. వేదాలు నిత్యసత్యాలు. వేదాలు రచించబడినవి కావు. అవి అపౌరుషేయాలు. వేదాలు స్వతఃప్రమాణాలు, అనాది నిధనాలు, ఈశ్వర స్వరూపాలు, తరగని ఐశ్వర్యప్రదాయకాలు. వేదాలు ధర్మానికి మూలస్తంభాలు. భారతదేశం వేదాత్మ అనీ, భారతవాణి అనీ వేదవాణి అనీ బాబావారు నొక్కివక్కాణిస్తూయుంటారు.

ఈ వేదవిద్యను అనూచాన సాంప్రదాయంగా గురుముఖతః సంపాదించి, ఆకళించు కొన్న పండిత ప్రకాండులు ఈ యజ్ఞంలోఋగ్వేద, యజుర్వేదములను పూర్తి పారాయణ చేస్తారు. మధ్యమధ్య సామవేద ఋక్కులను గానం చేస్తారు. ఉచ్చారణ, స్వరము తు.చ. తప్పకుండా ఈ పండిత సామూహిక వేదపఠనం చెవులకెంతో ఇంపుగా వినపడును. ఈ వేద మంత్రశబ్దధ్వనులు శాంతికరం, కల్యాణకరమని, వాతావరణాన్ని పరిశుద్ధం చేయునని బాబావారు చెప్తూయుంటారు.

*జ్ఞానయజ్ఞం*

ఈ సప్తాహ జ్ఞానయజ్ఞంలో బాబావారు ప్రతి రోజూ మధ్యాహ్నం వారి దివ్యప్రవచనాల

ద్వారా పండిత పామర రంజకంగా, సులభశైలిలో కర్మ, ధర్మ, బ్రహ్మ జ్ఞానాన్ని వేలాది భక్తజనానికి అందిస్తూయుంటారు. వేదాల్లోని నిగూఢ రహస్యార్థాలతో, వేదాంత విజ్ఞాన సునిశ్చితార్థాలైన మహావాక్య వివరణలతో బాబావారు అద్వైతామృత వర్షాన్ని ఆ వారంరోజులూ కురిపిస్తూ యుంటారు. ఈ సందర్భంలో, జీవబ్రహ్మైక్యానుసంధాన మంత్రమైన సోऽహంతత్త్వాన్ని బాబావారు అనేకసార్లు ఉద్ఘాటిస్తూయుంటారు. ఇదే జ్ఞాన పురుషుని జ్ఞానయజ్ఞం.

జ్ఞానయజ్ఞంతోబాటు సాయిభజనలు, హరి కథలు, సంగీత కచేరీలు, సాంస్కృతిక కార్య క్రమాలతో ఈ దసరాయజ్ఞం శోభిల్లుచుండును!

*దాన, దక్షిణ, సుజల యజ్ఞాలు*

సాయిదసరాయజ్ఞంలో దానాలు, ధర్మాలు, దక్షిణలు విరివిగా యుంటాయి. వేలమందికి అన్నదాన, వస్త్రదానాదులు నారాయణ సేవద్వారా జరుగుచూ యుంటాయి. త్యాగమే యజ్ఞరహస్యం కాబట్టి, శ్రీ సత్యసాయి ఉచిత విద్య, వైద్య సౌకర్యాలు దేశఖ్యాతిని పొందినవి.

ఈ యజ్ఞంలో పాల్గొన్న ఋత్విక్కులు, పారాయణవేత్తలు, వేదవేత్తలకు, జపం చేసే పురోహితవర్గానికి, సంగీత సాహిత్య విద్వాంసులకు బాబావారు స్వయంగా పట్టువస్త్రాలు, శాలువలు, భూరి దక్షిణలతోబాటు సృష్టించిన విభూతిని, కంకణాలు, ఆభరణాలను ఇస్తూయుంటారు. వారంతా ధన్యులే!

ఈనాటి దసరాయజ్ఞ పూర్ణాహుతి రోజున ఒక విశిష్ట చారిత్రాత్మక దానయజ్ఞం జరిగినది. రమారమి 300 కోట్ల రూపాయల ఖర్చుతో, సుమారు 730 గ్రామాలలోని 10 లక్షల దాహార్తితో బాధపడుచున్న ప్రజల నుపకరించు శ్రీ సత్యసాయి రక్షిత సుజల పథక దానకార్యక్రమం అత్యద్భుతంగా జరిగినది. క్రితం అయిదు శతాబ్దాలలో ప్రభుత్వాలు చేయని పనిని స్వామి రెండేళ్లలో పూర్తి చేసి, ఆ సుజలపథకాన్ని ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వానికి, అనంతపురంజిల్లా ప్రజలకు ప్రదానం చేశారు.

పురుషచతుష్టయసన్నివేశం

ఈ వేదపురుషసప్తాహజ్ఞానయజ్ఞంలో దివ్య పురుషచతుష్టయ సన్నివేశం జరుగుచున్నది. వేదపురుషుడు చతుర్ముఖబ్రహ్మ వేదాధ్యయనంలో మూర్తీభవించాడు. "యజ్ఞోవై విష్ణుః" కాబట్టి ఈ యజ్ఞపురుషుడే విష్ణువు. జ్ఞానస్వరూపుడైన శివుడు జ్ఞానపురుషుడు కదా! అవతార పురుషుడైన శ్రీ సత్యసాయి ఈ యజ్ఞానికి యజమాని. కాబట్టి వేదపురుష, యజ్ఞపురుష, జ్ఞానపురుషత్రయం వారిలో మూర్తీభవించినది. అందుచేతనే ఈనాటి యజ్ఞంలో శ్రీ సత్యసాయి ఆరాధనను తొమ్మండుగురు భాగవతసమాజ భక్తులు అనవరతంగా ఏడురోజులూ శ్రీ సత్యసాయి గాయత్రీ పునశ్చరణద్వారా చేసినారు.

ఓం సాయీశ్వరాయ విద్మహే, సత్యదేవాయ ధీమహి
తన్నస్సర్వః ప్రచోదయాత్ ॥

**ఘండికోట వెంకటసుబ్బారావు**
*(ప్రశాంతినిలయం)*

వేదములు చెప్పునట్టిదె విహితకర్మ
చెప్పబడనట్టి దెల్ల నిషిద్ధ కర్మ
విధి నిషేధంబు నెవ్వడు విస్మరించు
వాని పాపాత్ముడని పేరు పలుకనగును!
..బాబా

# ''శరీరమాద్యం ఖలు ధర్మసాధనం''

*రక్తము మాంసశల్యముల రాశియు దేహము మీరు కాదు సు*
*వ్యక్తముకాని కోరికలు వ్యర్థమనస్సును మీరు కాదు గా*
*ముక్తికి బంధకారమగు మోహపు భ్రాంతియు మీరు కాదు మీ*
*శక్తిని మీరెరుంగ గల శాశ్వతుడౌ పరమాత్మ మీరెగా!*

ప్రేమాత్మస్వరూపులారా!

శరీరము, ఇంద్రియములు, మనస్సు, బుద్ధి - ఇవన్నీ మానవుని ఉపాధులు. ఈ ఉపాధుల రహస్యమును గుర్తించినవాడే ఆత్మతత్త్వమును అర్థం చేసుకోగలడు. మొదటిది శరీరము. శరీరమనగా జీర్ణించిపోవునదని అర్థం. ఇది మొట్టమొదట ఒక మాంసపుముద్దగా ఉంటుంది. తదుపరి కోమలమైన స్వరూపాన్ని ధరిస్తుంది. యౌవనంలో అందముతో ప్రకాశిస్తుంది. తదుపరి దినదినమునకు జీర్ణించిపోయి వృద్ధాప్యంలో అనేక వికారములను పొందుతుంది. దీనికి 'దేహము' అని మరొక పేరున్నది. ''దహ్యతీతి దేహః'' అనగా, దహింపబడేది దేహము. ఇది ఎలాంటిది?

*మలినపుకొంప రోగముల క్రమ్మెడు సేవక గంప జాతసం*
*చలనము పొందు దుంప భవసాగరమీదగ లేని కంప అం*
*ఋలపొది లెమ్ము చూడ మన మెప్పుదలంపగ దేహమింకస*
*శ్చలమని నమ్మబోకు మనసా హరిపాదము లాశ్రయింపవే.*

శరీరమునకు 'చిత' అని కూడా పేరు గలదు. చిత అనగా అగ్ని. ఇది మరణించినవారిని దహిస్తుంది. కానీ చింత అనేది జీవించినవారినే దహించివేస్తుంది. మానవశరీరం జడమైనది. ఇది జడమైనదైతే మరి ఎట్లా పెరుగుతున్నది? అని మీకు సందేహం కలుగవచ్చు. ప్రతి రోజు మన గృహమును ఊడ్చి యింత చెత్తను తీసుకుపోయి ఒక గుంతలో వేస్తే కొంతకాలానికి అదొక దిబ్బగా పెరిగిపోతుంది కదా! అదేవిధంగా ఈ శరీరానికి మనం ప్రతి రోజూ మూడు పూటల ఆహారమును అందించడంచేత ఈ 'దిబ్బ' కూడా పెరిగిపోతుంది. అయితే ఇందులో దివ్యత్వమనే చైతన్యం ఉండి అన్ని పనులనూ చేయిస్తున్నది.

### *క్షేత్రము-క్షేత్రజ్ఞుడు*

''శరీరమాద్యం ఖలు ధర్మసాధనం'' ధర్మాచరణ నిమిత్తమై ఈ శరీరం ప్రసాదింపబడింది. భగవద్గీతయందు శ్రీకృష్ణుడు దీనికి క్షేత్రమని పేరు పెట్టాడు. క్షేత్రమనగా ఏమిటి? కాశీలో విశ్వేశ్వరుడు ఉండటంచేత దానిని కాశీ క్షేత్రమని అన్నారు. అనగా భగవంతునికి నిలయమైన దానిని క్షేత్రమని పిలుస్తారు. ఈ దేహము కూడా ఒక క్షేత్రమే. ఎందుకంటే ఇందులో ఆత్మ అనే క్షేత్రజ్ఞుడున్నాడు. ''క్షేత్రక్షేత్రజ్ఞ చాపిమాం విద్ధి'' అన్నాడు కృష్ణుడు. క్షేత్రజ్ఞుడున్న మందిరం కాబట్టి క్షేత్రము కూడా పవిత్రమైనదే. కనుకనే మొదట మందిరానికి నమస్కరించి తదుపరి మూలవిగ్రహానికి నమస్కరిస్తాము. క్షేత్రమనగా పొలము అని రెండవ అర్థము కూడా ఉన్నది. పొలములో ఎట్టి విత్తులు నాటుదుమో అట్టి పంటయే పండుతుంది.

*''ఇది చేతు, అది చేతు యింకెన్నియో చేతు*
*ననుచు ఊహలు అల్లి అలసిపోకుడు*
*ఏ విత్తులను నాటి ఇచ్చోట నుంటిరో*
*ఆ ఫలమ్ములె మీకు అందుచుండు*
*విత్తనమొకటైన వేరైన ఫలములు*
*లభియించుటది ఎట్లు సాధ్యమగును?''*

కనుక ఈ దేహంతో ఎట్టి కర్మల నాచరింతుమో అట్టి ఫలితములను మనం అనుభవించక తప్పదు. మంచి

కర్మల నాచరించి మంచి ఫలితముల నందుకోవడానికి తగిన సంకల్పము చేసుకోవాలి. ఎట్టి వేదాంతి అయినప్పటికీ, ఎట్టి వేదశాస్త్రేతిహాస పురాణములను పఠించినప్పటికీ మొట్టమొదట తెలుసుకోవలసినది దేహతత్త్వమే! ఈ దేహము అనేక జన్మల కర్మఫలములను గైకొని వస్తుంటుంది.

''జననీ గర్భము నుండి జన్మించునప్పుడు
కంఠమాల లేవీ కానరావు. కానీ
కలదు కలదొక్క మాల మీ కంఠమందు
పూర్వజన్మల కర్మలు పొందుపరచి
ఎన్ని చేసిన అవియన్ని యెంచియెంచి
మంచియైనను చెడుగైన గ్రుచ్చికూర్చి
బ్రహ్మ మీకిచ్చి పంపును ఋజువుమాల
కర్మలన్నియు చేర్చిన కంఠమాల''

ఏ ఒక్కటీ మైనస్ చేయడంగాని, ప్లస్ చేయడంగాని ఉండదు. ఉన్నది ఉన్నట్లుగానే మీకిచ్చి పంపిస్తాడు బ్రహ్మ. కనుక మీ అదృష్టమునకు, దురదృష్టమునకు మీ కర్మలే కారణంగాని మరొకటి కాదు.

## భగవత్ప్రీత్యర్థం చేసేదంతా యజ్ఞమే!

మీరు నిరంతరము దైవస్మరణ చేస్తూ, దైవకర్మల నాచరిస్తూ, దైవయజ్ఞం గావిస్తూ రావాలి. మీరు పుట్టినది మొదలు గిట్టునంతవరకు యజ్ఞము చేస్తూనే ఉన్నారు. యజ్ఞమనగా ఏమిటి? నిత్యజీవితములో మీరు చేసే సమస్త కర్మలూ యజ్ఞస్వరూపములే. కనుక మీరు ప్రత్యేకించి యజ్ఞయాగాదులు, జపతపములు చేయనక్కర లేదు. సజ్జనుల సేవ చేయండి. తోటివారి బాధలను నివారణ గావించండి. సమాజసేవచేతనే మీరు సర్వేశ్వరానుగ్రహాన్ని పొందగలరు. ప్రతి మానవుడు తన కర్మలను తాను ఆచరిస్తూనే ఉన్నాడు. ఒక కర్మ తరువాత మరొక కర్మ ప్రారంభిస్తూనే ఉన్నాడు. ఒకటి చేసి తృప్తి పడే స్వభావము కాదు మానవునిది. ఇంకా ఎన్నెన్నో చేయవలసి ఉంటుంటాయి. కనుక మానవ జీవితమంతయు కర్మమయమైనది. ఈ కర్మలు ధర్మమయమైనప్పుడే బ్రహ్మ ఆనందిస్తాడు. కనుక సర్వకర్మలను భగవత్ప్రీత్యర్థంగా సల్పాలి. ''ఇది నేను చేస్తున్నాను'' అనే భావం వస్తే ఆ ఫలితం, మంచిదైనా, చెడ్డదైనా మీకే అంటుకుంటుంది. అది యజ్ఞం కానేరదు. కర్మఫలాపేక్ష లేకుండా భగవత్ప్రీత్యర్థంగా చేసేది యజ్ఞంగా మారుతుంది.

మీకు తెలుసు : పూర్వం యజ్ఞం ప్రారంభించడానికి ముందు రెండు కట్టెలను ఒకదానిపై ఒకటి ఉంచి అగ్నిని పుట్టించేవారు. ప్రాకృతమైన అగ్నిచే యజ్ఞమును ప్రారంభించాలి; కృతకమైన అగ్నిచే కాదు. తిలలయందు తైలమువలె, ఫలమునందు రసమువలె, పుష్పమునందు సుగంధమువలె కట్టెయందు అగ్ని ఉంటున్నది. అయితే ఒక కట్టెలో అగ్ని లభ్యం కాదు. ఒక కట్టెను మరొక కట్టెతో రాపిడి జరగాలి. అదేవిధంగా మనలో జ్ఞానాగ్ని ఉద్భవించాలంటే దేహము, మనస్సు రెండింటిని మథనం చేయాలి.

## దైవార్పితమైనప్పుడే మనస్సుకు శాంతి

నిర్నిరామయమ్మైనదీ, నిరంతరం కొనసాగుచున్న అంతులేని ఆశలచే, అర్థం కాని ఆవేదనలచే అప్రాప్య ప్రాప్తికై ప్రాకులాడే మానవునికి దిక్కును చూపే చుక్కాని దీపికలు ఆధ్యాత్మిక జ్యోతులు. సముద్రంలో ఓడలకు, స్టీమర్లకు గుర్తు తెలుపడానికి లైట్‌హౌస్‌లు ఉంటాయి. అదేవిధంగా సంసారసాగరములో మానవునికి దిక్కు చూపేవి ఆధ్యాత్మిక జ్యోతులు. దేహాన్ని జలంతో శుద్ధం చేసుకొన్నట్లుగా మనస్సును జ్ఞానంతో శుద్ధం చేసుకోవాలి. దినమునకు పది పర్యాయములు స్నానం చేసినంతమాత్రమున దైవత్వం ప్రాప్తించదు. అంతఃశుద్ధత కూడా అత్యవసరం. ఏవిధంగానైతే శరీరమునకు మూడు పూటల ఆహారము నందిస్తున్నారో అదేవిధంగా మనస్సుకు కూడా మూడు పూటల ఆహారము నందించాలి. వీటినే ప్రాతఃసంధ్య,

మాధ్యాహ్నసంధ్య, సాయంసంధ్య అన్నారు. తెల్లవారి లేచిన తక్షణమే భగవంతుని స్మరించాలి, భజించాలి, ఆరాధించాలి. ఆహారాన్ని భగవంతునికి అర్పితం గావించి తదుపరియే భుజించాలి. అర్పితం చేయక పూర్వం అది సామాన్యమైన ఆహారంగా ఉంటుంది; అర్పితం చేసిన తరువాత అది ప్రసాదంగా రూపొందుతుంది. తిరిగి రాత్రి భుజించి పవళించే సమయంలో భగవత్ ప్రార్థన చేయాలి. ఈవిధంగా మానసిక పరిశుద్ధతకు మీరు కృషి చేయాలి. ఈనాడు మీరు శరీరమునకు ఎన్నో అనుకూలములు చేసుకుంటున్నారుకాని, మానసిక పరిశుద్ధతకు ఏమాత్రము కృషి చేయటం లేదు. దేహానికి విశ్రాంతి నందించే రెస్టుహౌస్‌లను నిర్మించుకుంటున్నారుకాని మానసికి ప్రశాంతినందించే మందిరములు ఎక్కడా కనిపించడంలేదు. మనస్సుకు ఎక్కడుంది రెస్టు? దైవానికి అర్పితం గావించినప్పుడే దీనికి సరైన రెస్టు చేకూరుతుంది. కనుక శాంతిని పొందాలనుకుంటే దైవారాధనలో కాలమును అధికముగా ఖర్చు పెట్టండి.

### *ఇతరులెఱుగకున్న ఈశ్వరుడెఱుగడా?!*

ఏ పని చేసినా, ఏ మాట చెప్పినా అందులో స్వార్థం లేకుండా చూసుకోండి. దేహాభిమానమును వీడి దేశాభిమానమును పెంచుకోండి. దేశమే లేక దేహమెక్కడిది? సమాజంలో మీరు ఒక్కరే పుట్టలేదు, సమాజం లేక మీరు ఒంటరిగా నిలువలేరు. కనుక సమాజంలో జీవించేటప్పుడు మీ ఇష్టానుసారం ప్రవర్తించుటకు వీలుకాదు. సమాజధర్మాన్ని అనుసరించకపోతే మీరు సమాజంలో ఉండటమెందుకు?! అరణ్యంలో పోయి కూర్చోండి! సమాజ ధర్మాన్ని మీ ప్రాణసమానంగా భావించుకోవాలి. కానీ ఈనాటి యువకులలో ఇట్టి పవిత్రమైన భావం ఏమాత్రము కనిపించడం లేదు. "ఇది నా ఇష్టము, నా స్వేచ్ఛ ప్రకారం నేను నడుచుకుంటాను. ఎవరు నన్ను అడిగేవారు?" అంటారు. అడగవలసినవారే అడుగుతారు. ఇతరు లెరుగకున్న ఈశ్వరుండెరుగడా? మీరు చేసే పనులు, ఆడే నాటకాలు మానవమాత్రులకు తెలియకుండా ఉండవచ్చుకాని, భగవంతునికి తెలియకుండాపోవు. సమయం వచ్చినప్పుడు అతనే మిమ్మల్ని దోషులుగా నిలబెడతాడు. అలాంటి పనిష్మెంట్ రాక పూర్వమే మీరు సరియైన మార్గంలో ప్రవేశించాలి.

### *స్వధర్మం - పరధర్మం*

ఏమిటి స్వేచ్ఛ అంటే? ఇష్టప్రకారము కుక్కలు తిరిగినట్లు తిరగటమా? కాదు, కాదు. స్వ + ఇచ్ఛ = స్వేచ్ఛ. అనగా ఆత్మఇచ్ఛయే స్వేచ్ఛ. భగవద్గీతయందు స్వధర్మం, పరధర్మం రెండూ చెప్పబడినాయి. స్వధర్మమనగా ఈశ్వరధర్మం, పరధర్మమనగా దేహధర్మం. మీరు వచ్చినది దేహధర్మంకోసం కాదు; కనుక ఆత్మధర్మాన్ని అనుసరించండి. అప్పుడే మీ జన్మ సార్థకమవుతుంది. కానీ ఈనాడు స్వధర్మమంటే బ్రాహ్మణులు బ్రాహ్మణధర్మమనీ, వైశ్యులు వైశ్యధర్మమనీ, క్షత్రియులు క్షత్రియధర్మమనీ, శూద్రులు శూద్రధర్మమనీ ఈవిధంగా ఎవరికి తోచినట్లు వారు భావిస్తున్నారు. ఇవన్నీ వర్ణాశ్రమధర్మాలు. కృష్ణుడు స్వధర్మమును పాటించ మన్నాడుకాని, వర్ణాశ్రమధర్మాలను పాటించ మని అనలేదే! కనుక మీరు అనుసరించ వలసినది ఆత్మధర్మమే.

### దేహం దైవమందిరం

శ్రవణం, కీర్తనం, విష్ణుఃస్మరణం, పాదసేవనం, వందనం, అర్చనం, దాస్యం, స్నేహం, ఆత్మనివేదనం - ఈ నవవిధ సాధనలు దేహానికి సంబంధించినవే! ఈ దేహాభిమానమును పోగొట్టుకొనే వరకు మాత్రమే ఈ సాధనలు మనకు అవసరం. అసలు ఈ దేహమంటే ఏమిటి? ఇందులో ఎవరైనా ఉన్నారా? నివసించేవారెవ్వరూ లేకపోతే ఇల్లు ఎందుకు కట్టుకుంటాం మనం? సామాన్యంగా

చదువుకున్నవాడుగాని, చదువులేనివాడుగాని ఒక పెద్ద భవనమును చూస్తే 'వీడెవరో శ్రీమంతుడు' అని అనుకుంటాడు. ఒక పూరి గుడిసెను చూస్తే 'వీడెవరో పేదవాడు' అని భావిస్తాడు. అనగా ఇల్లును చూసి అందులో ఉన్నవాని గొప్పతనమును లేక చిన్నతనమును నిర్ణయిస్తున్నాడు. అట్లే, ''జంతూనాం నరజన్మ దుర్లభమ్'' అన్నారు. మానవశరీరము చాల దుర్లభమైనది, మహాపవిత్రమైనది. దేనివల్ల? ఇందులో ఆత్మ అనే దేవుడుంటున్నాడు. కనుకనే దేహమున కింత విలువ ఇవ్వబడినది. ఈ విలువను మనం సార్థకం చేసుకోవాలి. కానీ మానవుడు దేహమే ప్రధానమని భావిస్తున్నాడు, దేహాభిమానమును వదలటం లేదు. కరెంటు లేని వైరు, నీరు లేని పైరు, పంతులు లేని బడి, దేవుడు లేని గుడి ఉండి ప్రయోజనమేమిటి? దేవుడు లేని గుడిలో ఎవ్వరైనా పూజలు చేస్తారా? చేయరు. ఈ దేహమనేది దేవుడున్న గుడి కాబట్టే అందరూ దీనిని ప్రేమిస్తున్నారు.

### ''ఏకం సత్ విప్రాః బహుధా వదంతి''

ఇంటి యజమానిని కోడలు వచ్చి, ''మామగారూ!'' అని పిలుస్తుంది. కుమారుడు వచ్చి ''తండ్రిగారూ!'' అని పిలుస్తాడు. భార్య వచ్చి ''ఏమండీ!'' అంటుంది. వీరందరూ వివిధ నామములతో పిలుస్తున్నారుకాని ఉన్న వ్యక్తి ఒక్కడే కదా! అట్లే భగవంతుడు ఒక్కడే. ''ఏకం సత్ విప్రాః బహుధా వదంతి.'' జ్ఞానులు, యోగులు, భక్తులు, సాధకులు ఒక్కొక్కరు ఒక్కొక్క పేరుతో ఆరాధిస్తూ వస్తున్నారు. ఒకరు ''ఆత్మస్వరూపుడా!'' అని పిలుస్తారు; ఒకరు ''జ్యోతిస్వరూపుడా!'' అని పిలుస్తారు. ఎవరి భావం ఏవిధంగా ఉందో భగవంతుడు ఆవిధంగా వారికి దర్శనమిస్తుంటాడు. భగవంతుడు రూపనామ రహితుడు; భక్తుల తృప్తి కోసమే రూపనామాలను ధరిస్తున్నాడు. మీ భావమును పురస్కరించుకొనియే భగవంతుడు మిమ్మల్ని అనుగ్రహిస్తాడు.

### దేహం 'నేను' కాదు

అనేక పర్యాయములు నేను పిల్లలకు చెబుతుంటాను. ''ఇది నా కర్చీఫ్'' అనుచున్నప్పుడు కర్చీఫ్ నా కంటే వేరుగా ఉన్నది కదా! అదేవిధంగా నీవు ''ఇది నా చెయ్యి, నా కాలు, నా తల, నా కడుపు'' అనుచున్నప్పుడు ఈ దేహము నీకంటే ప్రత్యేకంగా ఉండాలి. కనుక నీవు దేహము కావు. మరి నీవెవరు? ఎప్పుడు వచ్చావు? అని నిన్ను అడిగితే దేహమే నీవనుకొని ''నిన్న సాయంకాలం వచ్చాను'' అంటావు. కానీ నీకు కడుపు నొప్పి వస్తే, ''నా కడుపు నొప్పిగా ఉంది '' అంటావు. 'నా కడుపు' అన్నప్పుడు కడుపు నీకంటే ప్రత్యేకంగా ఉండాలి కదా! అనగా ఇక్కడ దేహం 'నేను' కాదు అని పరోక్షంగా తెలియజేస్తున్నావు. మరి 'నేను' ఎవరు? ఈ ప్రశ్నను ఎవరికి వారు వేసుకోవాలి. మొట్టమొదట దేహము కేవల మొక ఉపాధి మాత్రమేనని గుర్తించాలి. ''భిక్షాన్నం దేహరక్షార్థం, వస్త్రం శీతనివారణం'' దీనికోసం దేహం పని చేయాలి. ఇంతటితో తృప్తిపడకుండా దైవకార్యాలలో ప్రవేశించాలి.

### అహంకారానికి మూలం దేహాభిమానం

కరెంటు, బల్బు రెండూ చేరినప్పుడే మనకు వెలుతురు లభ్యమౌతున్నది కదా! అదేవిధంగా మన దేహమనే బల్బులో దివ్యశక్తి అనే కరెంటు చేరడంచేతనే కన్నులు చూడగల్గుతున్నాయి, చెవులు వినగల్గుతున్నాయి, చేతులు పనిచేయగల్గుతున్నాయి, నోరు మాట్లాడగల్గుతున్నది. ఆ దివ్యశక్తియే లోపల లేకపోతే ఏ ఒక్క అంగమూ పని చేయలేదు. కానీ మానవుడు అంతా తానే చేస్తున్నానని అహంకారపడుతున్నాడు. అహంకారం పెద్ద అజ్ఞానం! ఏ రోగానికైనా మందులున్నాయికాని అహంకారానికి, అసూయకు మాత్రం మందులు లేవు. పతనమే వీటికి సరియైన మందు! పతనమైన తరువాత కళ్ళు తెరచి ప్రయోజనమేమిటి? అహంకారమునకు మూలం

దేహాభిమానమే! దేహాభిమానం కూడా ఉండవలసిందేకాని మితిమీరి పెంచుకోకూడదు.

## అందరిలోను దైవాన్ని దర్శించడమే ఆధ్యాత్మికం

విశ్వం విష్ణుస్వరూపం. " సహస్రశీర్షా పురుషః సహస్రాక్ష సహస్ర పాత్". ఇదే విశ్వవిరాట్స్వరూపం. ఆనాడు విప్రులు వేదమును అభ్యసించే సమయంలో ప్రపంచమంతా చేరి మూడు కోట్లమందే ఉన్నారు. ప్రతి వ్యక్తి దైవస్వరూపమే కనుక, వారిని ముక్కోటి దేవత లన్నారు. ఇప్పుడు ప్రపంచ జనాభా 500 కోట్లకు పెరిగిపోయింది. అయినా ఇప్పటికీ మనం ముక్కోటి దేవతలనే అంటున్నాము. ఇది పొరపాటు. ఇప్పుడు 500 కోట్ల దేవతలున్నారు. అంతా దైవస్వరూపులే! వేదము "సర్వ జీవ నమస్కారం కేశవం ప్రతిగచ్ఛతి" అన్నది. ఎవరికి నమస్కరించినా కేశవునికే చెందుతుంది. ఇంతేకాదు. "సర్వ జీవ తిరస్కారం కేశవం ప్రతి గచ్ఛతి". కనుక ఎవ్వరినీ దూషించకూడదు; ఎవ్వరినీ అపహాస్యం చేయకూడదు. అందరినీ దైవస్వరూపులుగా విశ్వసించాలి. ఇదే నిజమైన ఆధ్యాత్మికం. పూజ చేయడం, జపం చేయడం, ధ్యానం చేయడం - ఇవన్నీ ఆధ్యాత్మికం కాదు. వీటివల్ల భగవంతుడు లభ్యమవుతాడని అనుకోవడం చాల వెఱ్ఱితనం. అందరి యందు దైవమున్నాడనే విశ్వాసాన్ని గట్టిగా కలిగియుంటే నీ లక్ష్యాన్ని నీవు తప్పక సాధిస్తావు.

## దైవవిశ్వాసం లేనివారికే మనస్సువల్ల ప్రమాదం

వర్షం కురిసేటప్పుడు మధ్యమధ్య వడగండ్లు కూడా పడతాయి. నీరు పడితే దెబ్బ తగలదుకాని వడగండ్లు తాకితే దెబ్బ తగులుతుంది. కానీ ఈ వడగండ్లలోనిది కూడా నీరే కదా! మరి వీటికింత శక్తి ఎలా వచ్చింది? వీటిలో అనేక నీటిబిందువులు ఏకమైపోయాయి. కనుకనే ఇంత శక్తి వచ్చింది. కనుక మనకు యూనిటీ చాల అవసరం. యూనిటీ రావాలంటే ప్యూరిటీని అభివృద్ధి పర్చుకోవాలి. అప్పుడు మనకు డివినిటీ తప్పక ప్రాప్తిస్తుంది. ఈనాడు పరిపూర్ణమైన దైవవిశ్వాసం ఎవ్వరియందూ కనిపించడం లేదు. ఒక నిమిషంలో ఉన్నట్టుగా కనిపిస్తుంది, మరొక నిమిషంలో ఉండదు. గాలిని ఏవిధంగానైతే పట్టడానికి వీలుకాదో అదేవిధంగా, మనస్సు కూడా జారిపోతుంది, కారిపోతుంది, పారిపోతుంది కూడా! ఆనాడు అర్జునుడు కూడా "చఞ్చలం హి మనః కృష్ణ ప్రమాది బలవద్దృఢం" అన్నాడు. ఎవరికి ఇది ప్రమాదకరం? దైవవిశ్వాసం లేనివారికే! దైవవిశ్వాసం ఉన్నవారికి మనస్సువల్ల ప్రమాదమే లేదు. మనస్సును మనకై మనం పట్టుకొని చాల బాధలు పడుతున్నాము.

## సంసారాన్ని పట్టి పీడిస్తున్నది మీరే!

ఏదైనా వస్తువును ఐదువ్రేళ్ళతో గట్టిగా పట్టుకుంటే కొంతసేపటికి చేయి నొప్పి పెడుతుంది. పట్టుకోవడంవల్లనే నొప్పి కల్గుతున్నదికాని, విడిచిపెడితే నొప్పి లేదు కదా! అనేకమంది, "స్వామీ! ఈ సంసారం నన్ను పట్టి బాధిస్తున్నది. నేనేమి చేసేది?" అంటారు. ఇవన్నీ 'స్టంటు' మాటలు! మీరే సంసారమును పట్టారు, అది మిమ్మల్ని పట్టలేదు. సంసారమునకు కాళ్ళు లేవు, చేతులు లేవు, ముక్కు లేదు, నోరు లేదు. అన్నీ మీకే ఉన్నాయి. కనుక మీరే సంసారాన్ని పట్టి పీడిస్తున్నారుకాని, అది మిమ్మల్ని పట్టి పీడించడం లేదు. మీ అంతట మీరే దానిని పట్టి వదలలేక అనేక అవస్థలకు గురి అవుతున్నారు. పైగా మీ తప్పులను మీరు సమర్థించుకొంటున్నారు. ఇదే పెద్ద పాపము!

## మహావాక్యాలను మరువవద్దు

అయితే మిమ్మల్ని మీరు నిందించుకోవడం, మిమ్మల్ని మీరు చులకన చేసుకోవడం మంచిది కాదు. మిమ్మల్ని మీరు గొప్పగా చూసుకోండి. "తత్ త్వం అసి", "అది (దైవం) నీవే అయి వున్నావయ్యా!" అని వేదాంతం బోధిస్తున్నది. "అయమాత్మా బ్రహ్మ", " అహం బ్రహ్మాస్మి" - ఎంత గొప్ప పలుకులు ఇవి! ఇలాంటివాటిని మీరు విస్మరిస్తున్నారు.

ఏదో అవసరం వచ్చినప్పుడు మాత్రం నోటితో ఉచ్చరించి మరుక్షణం మరచిపోతున్నారు. ఇవి ఒక నిమిషంలో అవసరముండి మరో నిమిషంలో అవసరం లేకుండా పోయేవి కాదు. ఎప్పుడూ అవసరమే! మీరెన్ని పనులు చేస్తున్నప్పటికీ మీ ఉచ్ఛ్వాస నిశ్వాసములు నిల్చిపోవటం లేదు కదా! "అయ్యో! పాపం! ఇతను నిద్రపోతున్నాడు కొంత విశ్రాంతి ఇద్దాం" అని ఆగిపోతున్నాయా? లేదే! అదేవిధంగా సర్వదా సర్వకాలేషు సర్వత్ర మీ భావములను దైవమయంగా మార్చుకోవాలి. ఈవిధంగా ప్రపంచమంతా మారితే ఇంక, "లోకాస్సమస్తా స్సుఖినో భవంతు" అని ప్రార్థన చేయనక్కర లేదు, జనులంతా శాంతిని అనుభవిస్తూనే ఉంటారు.

## శాంతిని పంచండి, పెంచండి

మొట్టమొదట మీ ఇంట్లో శాంతిని పొంది దానిని బజార్లో పంచండి; బజార్లో శాంతిని గ్రామంలో పంచండి; గ్రామంలో శాంతిని టౌన్‌లో పంచండి..... ఈవిధంగా శాంతిని పంచుకుంటూ పోండి! కానీ, ఈ మోడర్న్ కాలంలో ఒకనికి అశాంతి కల్గిందంటే వాడు తన ఇల్లంతా అశాంతిమయం చేస్తాడు. ఇంక ఆ ఇంటివారు బజార్లోవారిని అశాంతికి గురి చేస్తారు. మీరు మాత్రం ఈవిధంగా అశాంతిని పంచకండి. ఒకవేళ మీకేమైనా అశాంతి కల్గితే మీలో మీరే బాధపడండి; మీ అశాంతిని మీరే దూరం చేసుకోండి, ఇంకొకరికి మాత్రం పంచకండి; భర్తకుగాని, భార్యకుగాని, పిల్లలకుగాని ఎవ్వరికీ మీరు అశాంతిని పంచకూడదు. అశాంతిని పంచడమనేది పెద్ద పాపము! ఒకవేళ శాంతి కల్గితే తప్పక దానిని అందరికీ పంచండి. ఎందుకంటే శాంతిలో ప్రమాదం లేదు, అశాంతిలోనే ప్రమాదమున్నది. ప్రమాదమున్నదానిని ఎవ్వరికీ పంచకూడదు. కొందరు తమ కిష్టమైనదైతే మంచిదంటారు; ఇష్టంలేనిది చెడ్డదంటారు. ఇంతకంటే మూర్ఖులు మరొకరు లేరు. మీకు మలేరియా జ్వరం వచ్చినప్పుడు లడ్డు ఇచ్చినా చేదుగా ఉందంటారు. ఆ చేదు మీ నాలుకలోనే ఉంటుందికాని, లడ్డులో కాదు. మీలో ఉన్న బలాన్ని మీరు చూసుకోకుండా అది బయటి వారిలో ఉందనడం ఎంత మూర్ఖత్వం! ఇలాంటివారినే రాక్షసులన్నారు. ఇలాంటి దుర్గుణములు మీలో రాకూడదు. మానవత్వం నుండి దైవత్వమునకు పోవాలికాని, రాక్షసత్వమునకు దిగజారకూడదు.

## విశ్వశాంతికే వేదపురుష యజ్ఞం

ప్రేమస్వరూపులారా! వేదపురుష సప్తాహ జ్ఞాన యజ్ఞమని ఈనాడు చేసే సంక్షేమ నిమిత్తమై, విశ్వశాంతి నిమిత్తమై మనం ప్రారంభించాము. ప్రతివ్యక్తి విశ్వశాంతి నిమిత్తమై పాటుపడాలి. వేదములో డివైన్ వైబ్రేషన్ ఉన్నది. కనుక మీకు వేదము అర్థం కాకపోయినా శ్రవణం చేస్తే చాలు. ఆ నాదంలోనే ఉంటున్నది ఆనందం! భగవంతుని మొట్టమొదట 'శబ్దబ్రహ్మామయి' అన్నారు. ఇట్టి భగవంతుని పొందాలంటే కోరికలను తగ్గించుకోవాలి. ప్రత్తిని వదిలిపెడితే పైకి ఎగిరి పోతుంది; ఉపల్‌ను వదిలిపెడితే క్రింద పడిపోతుంది. అనగా లైట్ గా ఉన్నవారే పైకి పోగలరు. కనుక మీరు ఉన్నతస్థాయికి పోవాలంటే కోరికలనే భారమును తగ్గించుకోవాలి. కోరికలుండవలసిందే మానవునికి. అవి లేకుండా బ్రతకడానికి వీలుకాదు. కానీ మితిమీరితే భారమై పోతుంది. పరీక్ష వ్రాయడానికి వెళ్ళేవాడు జేబులో రెండు పెన్నులు పెట్టుకోవచ్చు, ఇంకా కావాలంటే మూడు పెన్నులు పెట్టుకోవచ్చు. అంతేగాని జేబునిండా పెన్నులు పెట్టుకుపోతే ఏమన్నా అర్థముందా? నిజంగా వ్రాసేవానికి అన్ని పెన్నులు అక్కరలేదు. అదేవిధంగా మన ఆశలకు కూడా అంతు ఉండాలి. ఆశలను అరికట్టుకుంటే మీరెంతైనా బాగుపడతారు; భగవంతుడు కూడా తన అనుగ్రహంచేత మిమ్మల్ని పవిత్రులను గావిస్తాడు.

ఈ ఏడు దినములలో మీకు శరీర, ఇంద్రియ, మనోబుద్ధి లక్షణాలను చెప్పి తదుపరి ఆత్మతత్త్వాన్ని కూడా చక్కగా వివరిస్తాను. శరీరం, ఇంద్రియాలు, మనస్సు, బుద్ధి - ఇవన్నీ ఉపాధులు. ఈ ఉపాధుల స్థితిగతులను మీరు చక్కగా కనుక్కున్నప్పుడే మీ పరిస్థితి బాగుపడుతుంది.

*(తేది : 5-10-97న సాయికుల్వంత్ సభామండపంలో శ్రీవారు అనుగ్రహించిన దివ్యసందేశము నుండి)*

# ఇంద్రియాల దుర్వినియోగమే దుఃఖానికి మూలం

ప్రేమస్వరూపులారా!

దృశ్యకల్పితమైన ఈ జగత్తునందు కనిపించు ప్రతి ప్రాణి ఇంద్రియ భోగముల నాశించి, ఇంద్రియ సుఖము నపేక్షించి జీవించుటకు ప్రయత్నిస్తున్నది. కానీ ఈ ఇంద్రియ సుఖము ఎక్కడి నుండి ఆవిర్భవించుచున్నదనే విషయాన్ని ఎవ్వరూ గుర్తించుకోలేకపోతున్నారు. సమస్త ఇంద్రియ సుఖములకు పుట్టినిల్లు దుఃఖమే! దుఃఖమునందు పుట్టినవి సుఖము నేరీతిగా అందించగలవు? ''అనిత్యం అసుఖం లోక మిమం ప్రాప్య భజస్వమామ్'' మానవుడీ సత్యాన్ని గుర్తిస్తే తప్పక పవిత్రమైన స్థితిని పొందగలడు. ఎక్కడి నుంచి వచ్చాను? ఎక్కడ నిల్చాను? ఎక్కడికి వెళుతున్నాను? అనే మూడు రహస్యములను గుర్తించుకుంటే మానవ జీవితము సార్థక మవుతుంది.

ఇంద్రియములకు 'మాత్రలు' అని పేరు. మాత్రలనగా కొలతలు వేయునవి. ఎట్లా? 'పప్పులో తగినంతగా ఉప్పు లేదు' అని కొలత వేసి చెబుతుంది నాలుక. 'మనిషి చాల అందంగా ఉన్నాడుకాని, ముక్కు మాత్రం చిన్నది' అని కొలత వేసి చెబుతుంది కన్ను. ఈ ఇంద్రియములను పరిమితమైనరీతిలో ఉపయోగించుకోకపోతే అనేక కష్టనష్టములకు, రోగములకు గురికావలసి వస్తుంది. భగవంతుడు ఏ ఇంద్రియమును దేని నిమిత్తమై ప్రసాదించాడో గుర్తించి ఆ ప్రకారంగా దానిని సక్రమమైన మార్గంలో ఉపయోగించుకోవాలి. ఉదాహరణకు ముక్కును తీసికోండి. ఉచ్ఛ్వాస నిశ్వాసముల ద్వారా ప్రాణమును నిలబెట్టుకొమ్మని భగవంతుడు దీనిని ప్రసాదించాడు. శ్వాసను తీసికోవటం (సో....) శ్వాసను వదలడం (హం....) - ఈ రెండింటినీ కలిపితే సోఽహం (నేనే దైవం) అవుతుంది. దీనినే హంసగాయత్రి అన్నారు. ఈ అంతరార్థాన్ని గుర్తించమని భగవంతుడు నాసికను ప్రసాదించాడు. ఇట్టి పవిత్రమైన మంత్రాన్ని ప్రబోధింపజేసే నాసికయందు అపవిత్రమైన నశ్యం వేసుకుంటే నాసిక గతి ఏమి కావాలి?

ఇంక నాలుక నందించినది దేనికోసం? జయదేవుడు చెప్పాడు: ''ఓ పవిత్రమైన నాలుకా! రుచి ఎరిగిన నాలుకా! గౌరవమర్యాదలు తెలిసిన నాలుకా! నీవు నిరంతరం గోవిందా! దామోదరా! మాధవా! అని దైవనామాన్ని ఉచ్చరించు''. నాలుకతో సత్యము నుచ్చరించాలి; పరులను నొప్పించని పలుకులు పలకాలి; మధురమైన పదార్థములను భుజించాలి; మత్తు పదార్థములను తీసుకోకూడదు. మాంస భక్షణము చేయకూడదు. మద్యపానము, మాంసభక్షణ, ధూమపానము - ఈ మూడూ మానవత్వానికే విరుద్ధమైనవి. వీటివల్ల అనారోగ్యంతోపాటు అపకీర్తి కూడా కలుగుతుంది.

చెవులను కూడా సరియైన రీతిలో మనం వినియోగించుకోవాలి. ఏది వినవలెనో దానిని మాత్రమే వినాలి. వినవలసినదానిని విస్మరించి, వినరాని దానిని విశ్వసించి మన శ్రవణమును నాశనం చేసుకుంటున్నాము. సూరదాసు చెప్పాడు: ''ఓ భగవంతుడా! మానవులు చెవులుండి చవటలై అతిమనోహరమైన నీ గాన మాలింప నేరరైరి; కన్నులుండి గ్రుడ్డులై కళ్యాణకరమైన నీ రూపు దర్శింప నేరరైరి!'' భగవంతుని చూడని కన్నులెందుకు? అసలు

కన్నుల నెందుకిచ్చాడు భగవంతుడు? అడ్డం వచ్చిన ప్రతి దానిని చూడటం కోసమనా? బజార్లో సినిమా వాల్‌పోస్టర్లు చూడటం కోసమనా? కాదు, కాదు. నీవు రోడ్డుపైన నడిచేటప్పుడు ఏ వాల్ పోస్టర్‌నో చూసుకుంటూ పోతే ఏ కారో, రిక్షానో వచ్చి నిన్ను ఢీకొని ప్రమాదానికి గురి చేస్తుంది. కనుక నీవు రోడ్డుమీద వెళ్ళేటప్పుడు నీ దృష్టి రోడ్డు మీదే ఉండాలికాని మిగతావిషయాల మీద ఉండకూడదు.

## ఇంద్రియలోలత్వమే బంధకారణం

మొట్టమొదట ఇంద్రియముల ప్రమాణములను, ఇంద్రియముల విలువను, ఇంద్రియముల విశిష్టతను గుర్తించుకోవడానికి ప్రయత్నించాలి. కురంగ మతంగ పతంగ మీన భృంగములు వరుసగా శబ్దస్పర్శరూపరస గంధములకు లోబడి బంధింపబడుతున్నాయి, ప్రాణాలను కోల్పోతున్నాయి. జింకలు శబ్దమునకు వశమైపోతాయి; ఏనుగు దేహం పెద్దదేగానీ, బలము చాల గొప్పదేగానీ స్పర్శకు లోబడిపోతుంది. మిడతలకు అగ్ని కనిపించిందంటే తాము కాలిపోతామనే విచక్షణ కూడా లేక అందులో వచ్చి పడిపోతాయి; గాలమునకు మాంసపు ముక్కను పెట్టి నీటిలో వేసినప్పుడు చేపలు దానిచేత ఆకర్షింపబడి గాలమునకు చిక్కుకొంటాయి. ఈవిధంగా ఒక్కొక్క ప్రాణి శబ్దస్పర్శరూపరస గంధాదులలో ఒక్కొక్కదానికి లొంగిపోవడంవల్ల బంధింపబడుతున్నాయి. ఈనాటి మానవుడు ఈ ఐదింటికీ బద్ధుడైపోతున్నాడు; వశుడైపోతున్నాడు; బానిసైపోతున్నాడు. అందుకనే జీవితంలో స్వేచ్ఛను పూర్తిగా కోల్పోతున్నాడు. ఇంద్రియసుఖము దుఃఖము నుండే వచ్చింది. దుఃఖము నుండి మనకు దుఃఖమే ప్రాప్తిస్తుందికాని సుఖము ప్రాప్తించదు. మట్టికుండ బంగారు కుండ కావాలంటే ఎలా? మనం పుట్టినదే దుఃఖము నుండి. ఇంక సుఖము ఎలా ప్రాప్తిస్తుంది? ఈ సత్యాన్ని గుర్తించుకోలేక సుఖము, సుఖమని ఆరాట పడుతున్నాము. ఎక్కడుంది సుఖము? కేవలం దివ్యత్వమునందు మాత్రమే ఉన్నది. కనుక దివ్యత్వాన్ని ఆశ్రయించినప్పుడే మనిషి నిజమైన సుఖము ప్రాప్తిస్తుంది.

## మనస్సుకు పదిమంది భార్యలు!

మరొక విషయాన్ని మీరు ఆలోచించాలి. ఐదు కర్మేంద్రియములు, ఐదు జ్ఞానేంద్రియములు - ఈ దశేంద్రియములకు యజమాని ఎవరు? మనస్సే. ఈ దశేంద్రియములు మనస్సుకు భార్యలవంటివి. ఒక్క భార్య ఉండేనే జీవితములో అనేక అవస్థలు పడుతున్నారు మానవులు. ఇద్దరు భార్యలున్న ఉత్తానపాదుడు తన కుమారుడైన ధ్రువుణ్ణి అరణ్యానికి పంపవలసి వచ్చింది. ముగ్గురు భార్యలున్న దశరథ మహారాజు సాక్షాత్ శ్రీమన్నారాయణమూర్తినే అరణ్యానికి పంపాడు. భార్యలకు వశమైపోవడంచేత వారిట్టి అవస్థలకు గురి అయ్యారు. ఇంక పదిమంది భార్యలున్న మనస్సు గతి ఏమిటి? తనకు సుందరమైన ప్రదేశాలు చూపించమని కన్ను కోరుతుంది; తనకు రుచికరమైన పదార్థాలు కావాలని నాలుక ఆశిస్తుంది. ఒక దానిని తృప్తిపర్చితే మరొకటి ప్రారంభమవుతుంది. కనుక, ఈ పది ఇంద్రియములనూ తృప్తిపర్చడం ఎవ్వరికీ సాధ్యం కాదు. అర్జునుడు, 'చంచలం హి మనః కృష్ణ......' అన్నాడు. మనస్సుకు చంచలత్వం ఎక్కడి నుండి వచ్చింది? 'భార్యలు' పెట్టే బాధలవల్లనే దానికి చంచలత్వం ప్రారంభమైనది. ఈ ఇంద్రియములే మనస్సును భ్రమింపచేస్తున్నాయి. అవి మనస్సును ఒక్కక్షణమైనా స్థిరత్వంతో ఉండనివ్వవు.

## మానవుడనగా విలువైనవాడు

ఇంద్రియాలు మనకు సుఖము నందిస్తున్నాయని అప్పటికప్పుడు ఆనందిస్తున్నామేగాని, ఇవి మనలను భరింపలేని బాధలకు కూడా గురి చేస్తున్నాయి. ఇన్ని తెలివితేటలు గల్గిన మానవుడు కూడా ఈ సత్యాన్ని గుర్తించుకోలేక ఇంద్రియాలకు లొంగిపోతున్నాడు. క్షణభంగురమైన ఇంద్రియ సుఖాల నిమిత్తమై గొప్ప విలువైన మానవ జీవితాన్ని నాశనం చేసుకుంటున్నాడు.

విలువైన మానవ జీవితాన్ని నాశనం చేసుకుంటున్నాడు. నిజంగా మానవుడంటే చాల విలువైనవాడని అర్థము. లోకంలో మనిషికి ఉన్న విలువ దేనికీ లేదు. కానీ ఆ విలువను తెలుసుకోలేకపోవడంచేత మనిషి అధోగతి పాలవుతున్నాడు. బంగారానికి, డైమండ్స్‌కు విలువ కట్టేది ఎవరు? మనిషే! బొంబాయిలో చదరపుటడుగు రెండు లక్షల రూపాయలు. దానికి ఇంతటి విలువ ఏర్పడింది మనిషివల్లనే కదా! ఈనాడు వస్తువిలువలు పెరిగిపోతున్నాయిగాని మనిషివిలువ మాత్రం క్షీణించి పోయింది. కారణమేమిటి? మనిషి మానవతా విలువలను కోల్పోవడమే! ఏనాడైతే మనిషి స్వార్థ స్వప్రయోజనాలను త్యజిస్తాడో ఆనాడే తన విలువను తాను పెంచుకోగలడు.

### *అతిభాష మతిహాని*

మానవుడు ఆదర్శవంతమైన జీవితాన్ని అనుభవించే నిమిత్తమై భగవంతుడు అనుగ్రహించిన వరప్రసాదములే ఇంద్రియములు. మంచిని చూడాలి; మంచిని వినాలి; మంచిగా మాట్లాడాలి, మంచిని తలచాలి, మంచిని చేయాలి. ఇంతకుముందు మాట్లాడిన పిల్లవాడు చెప్పాడు: స్వామిబోధలలో ప్రధానమైనది Talk less, Work more. తక్కువగా మాట్లాడాలి, ఎక్కువగా పని చేయాలి. పూర్వకాలంలో మహర్షులందరూ మౌనం పాటించేవారు. దేనికోసం? అధికంగా మాట్లాడటంచేత ఇతరుల కేమైనా బాధ కలుగవచ్చును. లేక, అసత్యం ప్రవేశించవచ్చును. మౌనం వలన ఎంతటి ఉన్నత స్థాయి చేకూరుతుందో మీరు గుర్తించుకోలేకపోతున్నారు. ఒకప్పుడు వివేకానందుడు పది దినములు విరామం లేక మాట్లాడుతూ వచ్చాడు. పదకొండవ దినమున తాను నేర్చుకున్న శ్లోకములన్నీ మరచిపోయాడు. ఎంత ప్రయత్నించినా ఒక్క శ్లోకం కూడా జ్ఞాపకం రాలేదు. అప్పుడు సదానందుడు వచ్చి, ''నరేంద్రా! అధిక భాషణచేత నీ తెలివితేటలు మరుగున పడిపోతున్నాయి, జ్ఞాపక ది. కనుక కొంత కాలంపాటు మౌనం వహించు'' అన్నాడు. అతని సలహా ననుసరించి వివేకానందుడు పదహైదు దినములు మౌనంగా కూర్చున్నాడు. తదుపరి అన్ని శ్లోకములూ అతనికి జ్ఞప్తికి వచ్చాయి. ఈనాటి పిల్లలు పరీక్షల కోసమని తమ జ్ఞాపకశక్తిని పెంచుకోవాలని ప్రయత్నం చేస్తుంటారు. కానీ అధికంగా మాట్లాడటంచేత వారి జ్ఞాపకశక్తి క్షీణించిపోతున్నది. కనీసం పరీక్షల సమయమందైనా మాట్లాడకుండా ఉండటం మంచిది. మౌనంవల్ల జ్ఞాపకశక్తి, తెలివితేటలు అధికంగా అభివృద్ధి అవుతాయి. మాటలు అధికమయ్యే కొలది వృద్ధాప్యం కూడా అతి త్వరగా ప్రాప్తిస్తుంది.

### *నిగ్రహముంటేనే అనుగ్రహముంటుంది*

ఇంద్రియములు చాల పవిత్రమైనవి. చాల శక్తివంతమైనవి. ఇవన్నీ భగవత్‌వరప్రసాదములే! అయితే భగవదాజ్ఞ ప్రకారం వీటిని ఎంతవరకు ఉపయోగించు కోవాలో అంతవరకే ఉపయోగించుకోవాలి. అప్పుడే భగవదనుగ్రహం కూడా అత్యధికంగా ప్రాప్తిస్తుంది. అట్లుగాకుండా వీటిని దుర్వినియోగం చేసుకుంటే భగవదనుగ్రహం కూడా క్షీణించిపోతుంది. తన ఆజ్ఞను ఉల్లంఘించినప్పుడు భగవంతు డేవిధంగా మిమ్మల్ని అనుగ్రహించగలడు? ఏ సంకల్పంచేత తాను మీకు ఇంద్రియాలను ప్రసాదించాడో ఆ సంకల్పానికి అనుగుణంగా మీరు వాటిని ఉపయోగించుకోవాలి. మీ ఇష్టప్రకారం వాటిని ఉపయోగించుకోకూడదు, భగవంతుని ఇష్టాన్ని మీరు దృష్టిలో పెట్టుకోవాలి. ఇంద్రియాలను సక్రమమైన మార్గంలో ప్రవేశ పెట్టినప్పుడే మానవత్వం ధన్యమైపోతుంది.

### *అన్నం నుండి ఆనందానికి ప్రయాణించాలి*

మానవ జీవితమంతయు పంచకోశములచేత కట్టుబడియున్నది. అవి అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ, ఆనందమయ కోశములు. అయితే పశుపక్షిమృగాదులలో అన్నమయ,

ప్రాణమయ, మనోమయ కోశములు మాత్రమే ఉంటున్నాయి. మానవుడు కూడా ఈ మూడింటి వరకే ప్రయాణము చేస్తే ఇంక తనలో విజ్ఞానమయ ఆనందమయ కోశములు ఉండి ప్రయోజన మేమిటి?! కానీ ఈనాటి మానవుడు కనీసం విజ్ఞానమయ కోశంలో కూడా ప్రవేశించడం లేదు. నూటికో కోటికో ఏ ఒక్కరో విజ్ఞానమయ కోశంలో ప్రవేశిస్తున్నారు. తదుపరియే ఆనందమయకోశమున్నది. కానీ ఇంత వరకు ఎవ్వరూ దానిని కనిపెట్టలేదు, ఆ స్థాయికి చేరుకోలేదు. మన ప్రయాణం ఆనందమయ కోశం వరకు కొనసాగిపోవాలి. మధ్య స్టేషన్‌లలో దిగిపోతే అనేక ప్రమాదాలకు, కష్టాలకు గురియౌతాము.

''అసతోమా సద్గమయ
తమసోమా జ్యోతిర్గమయ
మృత్యోర్మా అమృతంగమయ''

'అసత్' నుండి 'సత్' లోనికి ప్రవేశించాలి. చీకటి నుండి వెలుగులోనికి ప్రయాణించాలి. మృత్యువు నుండి అమృతత్వాన్ని చేరుకోవాలి. అప్పుడే మనసు శాంతి లభిస్తుంది. అయితే దీనికి ముఖ్యంగా పాటించవలసిన సూత్రములు నాలుగు.

''త్యజ దుర్జన సంసర్గం
భజసాధు సమాగమం
కురు పుణ్యమహోరాత్రం
స్మర నిత్య మనిత్యతాం''

మొదటిది: **''త్యజ దుర్జన సంసర్గం''.** దుష్టుల సహవాసానికి దూరంగా ఉండాలి. ఎంతో గొప్ప విద్యావంతుడు, గుణవంతుడు, బలవంతుడైన కర్ణుడు దుర్యోధన దుశ్శాసనాదుల సహవాసంచేత దుష్టచతుష్టయంలో ఒకడై అపకీర్తి పాలయ్యాడు. పామువంటి విషపురుగైనా ఒక్కతూరి మాత్రమే కరుస్తుందికాని, దుష్టుని చెంత చేరితే వాడు క్షణక్షణము కరుస్తూనే ఉంటాడు. కేవలం దుష్టులు మాత్రమే కాదు, దుష్టభావాలు కూడా మనచెంతకు రాకుండా చూసుకోవాలి. ఇదియే ఆధ్యాత్మిక మార్గమునకు ప్రథమసోపానము.

రెండవది: **''భజ సాధు సమాగమం''**, దుస్సంగమును దూరం చేసుకున్నాక సత్సంగములో ప్రవేశించాలి. అసలు సత్సంగమనగా ఏమిటి? ఈనాడు ఈ లోకంలో సత్సంగమంటే భక్తులతోను, స్నేహం చేయడమని భావిస్తున్నారు. సత్సంగ మనగా అది కాదు. సత్ - అనగా శాశ్వతమైనది, మార్పుచెందనిది. అదే దివ్యత్వం. అట్టి దివ్యత్వంతో మనం స్నేహం చేయాలి.

మూడవది: **''కురుపుణ్య మహోరాత్రం''** రాత్రింబవళ్ళు పుణ్యకార్యములలో ప్రవేశించాలి. పుణ్యమంటే ఏమనుకుంటున్నారు? ''పరోపకారః పుణ్యాయ పాపాయ పరపీడనం'' అన్నారు వ్యాసులవారు. పరోపకారమే పుణ్యము. పరపీడనమే పాపము. మరి పరోపకారమంటే ఏమిటి? పరులకు మేలు చేయడం, దానధర్మాలు చేయడం - ఇవన్నీ పరోపకార సంబంధమైనవని మీరు భావిస్తున్నారు. ఇది కాదు పరోపకారము. ఇది బాహ్య ప్రపంచదృష్టిలో మాత్రమే పరోపకారం మనిపించుకుంటుంది. కానీ అంతరార్థాన్ని విచారిస్తే పర - అనగా దైవం, ఉప - అనగా సమీపం, కార - అనగా చేరిపోవడం. కనుక దైవానికి సమీపంగా చేరిపోవడమే పరోపకారము. ఇదే పుణ్యము. ఇట్లు చేయకుండా ఎవరికో ఇంత అన్నం పెట్టడం, పందలకొలది చీరలు, పంచెలు దానం చేయడం - ఇంత మాత్రం పరోపకారం కాదు. ఈ లెక్కలను కావాలంటే ఇన్‌కమ్ ట్యాక్స్ ఆఫీసర్‌కు చెప్పుకోవచ్చుగాని, భగవంతునికి చెప్పుకోవడానికి వీలుకాదు. భగవంతుని దృష్టిలో పరోపకారమంటే - భగవంతునికి సమీపంగా పోవడమే! ఇంక ''పాపాయ పరపీడనం''. పాపమంటే ఏమిటి? ఏకత్వమైన దివ్యత్వాన్ని అనేకత్వంగా భావించడమే పాపము. భగవంతుడు ఒక్కడే. ఎవరేపేరైనా పెట్టుకోవచ్చును. ఇట్టి ఏకత్వాన్ని అనేకత్వంగా విభజించే మేధావులు అధికమవుతున్నారుకాని, అనేకత్వాన్ని ఏకత్వంగా విశ్వసించే గుణవంతుడు ఒక్కడైనా కనిపించడం లేదు.

అనేకత్వాన్ని ఏకత్వంగా విశ్వసించడమే పుణ్యము; ఏకత్వాన్ని అనేకత్వంగా విభజించడమే పాపము. ఇట్టి సక్రమమైన అర్థములను తెలుసుకోలేక పోవడంచేత మానవుడు ఎంతకాలం సాధన చేసినా ఇంకా ఉన్నస్థాయిలోనే ఉంటున్నాడు.

ఇంక నాల్గవది: **"స్మర నిత్యమనిత్యతాం".** అనగా నిత్యానిత్యవిషయ పరిశీలన చేయాలి.

ప్రేమస్వరూపులారా! ముఖ్యంగా ఈనాడు మీరు తెలుసుకోవలసిన దేమిటంటే - భగవంతుడు మీకు అనుగ్రహించిన ఇంద్రియాలను సక్రమమైన మార్గం లోను, పరిమితమైన మార్గంలోను ప్రవేశ పెట్టాలి. ఇంతకంటే మీరు చేయవలసిన సాధన మరొకటి లేదు. అసలు మీరు ఏ సాధనలూ చేయనక్కర లేదు. ఎందుకంటే అన్నీ మీరే అయి ఉంటున్నారు. సర్వమూ తానైనవాడు ఇంక సాధన చేయడం దేనికోసం? నిప్పును అలక్ష్యం చేస్తే దానిని నివురు కప్పివేస్తుంది. అయితే ఆ నివురు నిప్పు నుండే వస్తుంది. అది నిప్పు నుండే వచ్చి నిప్పునే కప్పివేస్తుంది. దానిని ఒక్కసారి ఊదితే నిప్పు కనిపిస్తుంది. అదేవిధంగా మీయందే ఉంటున్నది దివ్యత్వం. దాని నుండే మాయ పుట్టి మిమ్మల్ని కప్పివేసింది. ఇది మాయ అని తెలుసుకుంటే మాయ పోతుంది, ఆత్మతత్త్వం కనిపిస్తుంది. దానికి మీరేమీ సాధనలు చేయనక్కరలేదు, ఏ తీర్థయాత్రలకూ పోనక్కర లేదు. మీ దృష్టిని అంతర్ముఖం గావించుకోండి, అంతే చాలు.

## స్వస్వరూప సందర్శనం

నిన్నటి దినము శరీరము గురించి, ఈనాడు ఇంద్రియముల గురించి మీరు తెలుసుకున్నారు. రేపటి దినము మనస్సు గురించి, తరువాత బుద్ధి గురించి వివరిస్తాను. ఈ నాల్గింటినీ తెలుసుకున్న తరువాతనే ఆత్మసాక్షాత్కార మవుతుంది. ఎందుకంటే ఇవన్నీ ఒకదానిపై ఒకటి చేరియుంటున్నవి. వీటన్నింటినీ తీసివేసినప్పుడే స్వస్వరూపాన్ని సందర్శించుకోవడానికి వీలవుతుంది. ఆత్మపై బుద్ధి, బుద్ధిపై మనస్సు, మనస్సుపై ఇంద్రియాలు, ఇంద్రియాలపై శరీరము - ఈవిధంగా ఒకదానిపై ఒకటి ఉంటున్నాయి. మొదట శరీరాభిమానమును త్యజించాలి, ఇంద్రియములను ప్రక్కకు నెట్టాలి, మనస్సును మరణింపజేయాలి, బుద్ధిని ప్రక్కకు త్రోయాలి. అప్పుడే ఆత్మసందర్శన ప్రాప్తి కల్గుతుంది. అయితే "బుద్ధి గ్రాహ్య మతీంద్రియమ్" అన్నారు. బుద్ధి ఆత్మకు అత్యంత సమీపంగా ఉండటంచేత దాని ప్రకాశము చాల గొప్పగా ఉంటుంది.

ముఖ్యంగా ఈనాటి పిల్లలందరూ ఇంద్రియ తత్త్వాన్ని చక్కగా గుర్తించాలి. ఇంద్రియాలకు లోబడి యువకులు పశువులకంటే హీనమై పోతున్నారు. పశుపక్షిమృగాదులైనా ఒక నియమంతో ఉంటున్నాయి. కానీ విద్యావంతుడైన, మేధావంతుడైన మానవుని యందు మాత్రం అసలు నియమమే లేకుండా పోతున్నది. ఇంకెందుకీ చదువులంతా? ఎందుకీ తెలివితేటలంతా? నిన్ను నీవు తెలుసుకోవడంకోసమే ఈ చదువులు రావాలి. అది లేనప్పుడు నీ తెలివితేటలు, నీ గ్రంథ పరిచయము అంతా వ్యర్థమే!

*"పుస్తకముల్ పఠించితి పూర్తిగ జూచితి సర్వశాస్త్రముల్*
*నిస్తులమైన విద్యలు నేర్చితినంచు గర్వమేల? నీ*
*హస్తయుగంబుమోడ్చి పరమాత్మను భక్తితొ కొల్వగలేని ఈ*
*ప్రస్తుత విద్యలన్నియు ధాత్రి నిరర్థకము కాదె మానవా!"*

*"నిద్దుర నుండి లేచి మరి నిద్దురపోయెడు దాది పొట్టకై*
*హద్దును పద్దు లేక వ్యయమందగజేయుచు జీవితంబు నీ*
*విద్దెల ధారపోసి అరవింద దళాక్షుని విస్మరించి ఏ*
*పెద్దసుఖంబునొందితివొ? ప్రీతిగయోచన చేయు మానవా!"*

తెల్లవారి లేచినది మొదలు రాత్రి పరుండునంత వరకు పొట్టకై హద్దు, పద్దు లేకుండా తిరుగుతున్నావు. ఏమి నీవు తెలుసుకున్నది? ఓ మానవుడా! ముందు నీ మానవత్వాన్ని చక్కగా గుర్తించుకో. దైవత్వంలో చేరిపో. ఇదే నీ జీవిత గమ్యం.

***(తేది:6.10..97 సాయంత్రం సాయికుల్వంత్ సభామండపంలో శ్రీవారు అనుగ్రహించిన దివ్యసందేశము నుండి)***

# సత్యోపనిషత్

(గత సంచిక తరువాయి)

59. స్వామీ! ఆధునిక విద్యారంగంలో Brain drain (విద్యావంతులు విదేశాల్లో స్థిరపడటం) ఎక్కువవుతున్న దనిపిస్తున్నది. అందరినీ కలవరపెడుతున్న సమస్య ఇదే. దీని గురించి స్వామి ఏమి శలవిస్తారు?

బాబా: విద్యావంతులలో ఈ రకమైన ధోరణి రావడం చాల దురదృష్టం. నువ్వు పుట్టింది ఈ సమాజంలోనే, పెరిగింది ఈ సమాజంలోనే, విద్యావంతుడవైనది ఈ సమాజంలోనే, కీర్తి ప్రతిష్ఠలను గడించింది ఈ సమాజంలోనే, ఆస్తిపాస్తులను సంపాదించింది ఈ సమాజంలోనే! ఇట్టి సమాజానికి నీవు కృతజ్ఞత చెప్పనక్కర లేదా? కృతజ్ఞత లేకపోతే నీవు మనిషివే కావు. ఏ సమాజం నిన్ను ఇంతవాణ్ణి చేసిందో ఆ సమాజానికి సేవ చేయటం ద్వారా నీవు కృతజ్ఞత చెప్పాలి. అసలు చెప్పాలంటే మనవాళ్ళు విదేశాల్లోనే బాగా కష్టపడి పనిచేస్తారు; ఇక్కడ చేయరు. ఇక్కడ పని చేస్తే వచ్చేది, అక్కడ ఎంతో కష్టపడి పని చేస్తే వచ్చేది ఒక్కటే అవుతుంది. అది గుర్తించుకోరు. ఇందులో తల్లిదండ్రుల లోపం కూడా ఉంది. వారు పిల్లలకు సరిగా చెప్పరు, పైగా ప్రోత్సహిస్తారు. నీ సమాజానికి నీవు సేవ చేయటం నీ కర్తవ్యం, ధర్మం. విదేశీయులు ఇక్కడకు వచ్చి ఎన్నో నేర్చుకుంటూంటే మనవారు ఉన్నదానిని వదలి వెళ్ళిపోతున్నారు. విదేశాల్లోని స్థానికులే మేలనిపించేటట్లున్నారు మనవారిలో కొందరు. ఏం ప్రయోజనం! ఎందుకీ విద్య?!

60. ఈ రోజుల్లో పిల్లలు రకరకంగా తయారవడానికి తల్లిదండ్రులు ఎంతవరకు బాధ్యులవుతారు?

బాబా: నా ఉద్దేశ్యంలో పూర్తిగా తల్లిదండ్రులే బాధ్యులు. చాలమంది తండ్రులు ధృతరాష్ట్రునిలా వ్యవహరిస్తుంటారు. తన కుమారులు ఏది చేసినా కాదనలేదు ధృతరాష్ట్రుడు. చివరికి ఆయన గతి ఏమయింది? తర్పణం విడువడానికి కనీసం ఒక్కడైనా లేకుండా పోయారు. ఈనాటి తల్లిదండ్రులకు పిల్లలను ఎలా పెంచాలో తెలియదనిపిస్తోంది. పిల్లలు టీవీ ముందర కూర్చుని చూస్తుంటే అభ్యంతరం చెప్పకపోగా పైగా భోజనం కూడా అక్కడికే తెచ్చి వడ్డిస్తుంది తల్లి. పిల్లలకు మంచి మేనర్స్ (మర్యాద), మంచి బిహేవియర్ (నడత) కూడా నేర్పించటం లేదు. మంచి మర్యాద గలవాడే నిజమైన మనిషి; మంచి నడత గలవాడే నిజమైన అబ్బాయి; మంచి నియమనిష్ఠలు గలవాడే నిజమైన భక్తుడు. పిల్లవాడు ఏ కోర్సులో చేరితే ఎంత పెద్ద ఉద్యోగం వస్తుంది? ఆ తరువాత విదేశాలకు పంపిస్తే ఇంకా ఎంత ఆదాయం వస్తుంది? అని తల్లిదండ్రులు ప్లాన్లు వేస్తుంటారుకాని, పిల్లవాని అభిరుచిని, ఆసక్తిని గురించి ఆలోచించరు. ఇంకా కొందరెట్లుంటారంటే తమ

పిల్లవాడు మంచి సంస్కారంవల్ల దేవాలయానికి వెళుతుంటే, ''నాయనా! చిన్నవాడివి; అప్పుడే ఎందుకు గుళ్ళూగోపురాలు? పెద్దవాడివయ్యాక చూసుకోవచ్చులే'' అంటూ వారిస్తారు. ఇలా ఉన్నారు ఈనాటి పెద్దలు. ఎవరైనా తనను కలుసుకోవడానికి వస్తే తండ్రి తాను ఇంట్లో ఉండి కూడా పిల్లవానితో, ''నేనింట్లో లేనని చెప్పురా!'' అని అంటాడు. ఇంక ఆయన దగ్గర నుండి పిల్లవాడు నేర్చుకొనేదేముంటుంది? అయినేమి నేర్పగలడు? ఈ ఆధునిక యుగంలో తల్లిప్రేమకు నోచుకోని పిల్లలు అనేకమంది ఉన్నారు. తల్లికి అనేక వ్యాపకాలు. ఉద్యోగం, స్నేహితులు, క్లబ్బులు వీటితోనే ఆమెకు సరిపోతుంది, పిల్లల్ని చూసుకోవడానికి టైమే ఉండదు. అందువేత పిల్లలు ఇంటిలోని 'ఆయా' (పనిమనిషి) చేతిలో పెరుగుతారు. ఇది ఎంతదాకా పోతుందంటే పిల్లవాడు ఆయా చనిపోతే ఏడుస్తాడుకాని, తల్లి మరణిస్తే ఏడ్వడు. ఎందుకని? వానికి తల్లిప్రేమ తెలిస్తేగా! ఇది చాల దురదృష్టం. శివాజీని అంతవాణ్ణి చేసిందెవరు? తల్లి. గాంధీని మహాత్ముణ్ణి చేసిందెవరు? తల్లి. పిల్లల్ని ఆదర్శవంతులుగా తీర్చిదిద్దవలసిన బాధ్యత తల్లిదండ్రులదే. ఆడపిల్ల చెడిపోతే కారణం తల్లి, మగపిల్లవాడు చెడిపోతే కారణం తండ్రి. తల్లిదండ్రులకు, సంస్థలకు, సంఘానికి కీర్తిప్రతిష్ఠలు తెచ్చేవారిగా తల్లిదండ్రులు పిల్లల్ని పెంచాలి; భావి భారతోద్ధారకులుగా, ఆదర్శ పౌరులుగా, సంస్కారవంతులుగా వారిని తీర్చిదిద్దాలి.

**అబ్బ! స్వామీ! చాల గట్టిగా మందలించారు. సర్వమూ మీకు తెలుసు. ఎక్కడ లోపం ఉన్నదో దాన్ని ఎత్తి చూపారు. అయితే ఈనాటి పిల్లల్లో కూడా తల్లిదండ్రులపై భయం, భక్తి లేకుండా పోయాయి; కృతజ్ఞత పూర్తిగా శూన్యం. తల్లిదండ్రుల పట్ల యువత ఎట్లా ఉండాలో శెలవివ్వండి స్వామీ!**

బాబా: భారతీయ సంస్కృతిలో శ్రుతులు, ''మాతృదేవోభవ, పితృదేవోభవ, ఆచార్యదేవోభవ'' అని స్పష్టంగా, ప్రధానంగా పేర్కొన్నాయి. ఈ విషయానికి సంబంధించి పురాణాలు అనేక దృష్టాంతాలను వర్ణించాయి. తల్లిదండ్రులను ప్రేమించడం, గౌరవించడం, సేవించడం భారతీయ సంప్రదాయం. నీ బ్లడ్డు, నీ ఫుడ్డు, నీ దుడ్డు, నీ హెడ్డు అంతా తల్లిదండ్రుల వరప్రసాదమని గుర్తుంచుకో. ఈనాడు నీవు నీ తల్లిదండ్రులను అగౌరవపర్చితే రేపు నీ బిడ్డలు నిన్ను కూడా అగౌరవపర్చుతారు. మామిడి పండు తింటే దోసకాయ త్రేపు వస్తుందా? మామిడి విత్తనం నాటితే వేపచెట్టు వస్తుందా? ఇంపాజిబుల్ (అసాధ్యం)! ఏది చేస్తావో అది తిరిగి నిన్ను చేరుతుంది. ఈ రోజు నీవు నవ్వుతూ చేయవచ్చుకాని, తరువాత ఏడుస్తూ అనుభవిస్తావు. ఎట్టి తిండియో అట్టి త్రేపు; ఎట్టి మేఘమో అట్టి వర్షం; ఎట్టి పిండియో అట్టి రొట్టె; ఎట్టి మంటయో అట్టి వంట. అంతా రియాక్షన్ (ప్రతిచర్య), రీసౌండ్ (ప్రతిధ్వని), రిఫ్లెక్షన్ (ప్రతిబింబం). ఇది తప్పదు, తప్పించుకోలేవు. ఈనాడు నీవు నీ తల్లిదండ్రుల కంట నీరు తెప్పిస్తే రేపు నీ బిడ్డలు నీ కంట నీరు తెప్పిస్తారు. అప్పుడప్పుడు నేనొక కథ చెబుతుంటాను. గోపీచంద్ అనే గొప్ప రచయిత ఉండేవాడు. ఆయనకు ఇద్దరు కుమారులు. ఒక రోజున ఆయన తన భార్యతో రైలు ప్రయాణం చేస్తూ కొడుకులిద్దరినీ స్టేషన్‌లో తనను కలుసుకోవలసిందిగా జాబు వ్రాశాడు. ఆ ప్రకారమే ఇద్దరు కొడుకులు అమ్మానాన్నలను కలుసుకోవడానికి స్టేషన్‌కు వచ్చారు. పెద్దకొడుకు వస్తూనే వారికి నమస్కరించి రైలు ప్రయాణం సుఖంగా జరిగిందా? అంటూ కుశల ప్రశ్నలు వేశాడు. ఇంక రెండవకొడుకు మాత్రం వారినేమాత్రము గౌరవించకుండా రైలు వెళ్ళిపోతుంటే చేయి ఊపుతూ 'టాటా' చెప్పాడు. ఇది చూసి గోపీచంద్ చాల బాధ పడ్డాడు. ఆయన భార్య మాత్రం ''ఏమండీ, చిన్నవాడే కదా! ఎందుకంత బాధపడ్తారు? పెద్దవాడయ్యాక వాడే నేర్చుకుంటాడు'' అని

సర్దిచెప్పబోయింది. అది విని ఆయన అన్నాడు: ''అది కాదే నా బాధ. వీడు నమస్కారం వేస్తే నాకు వచ్చేది లేదు, వేయకపోతే పోయేదీ లేదు. కానీ భవిష్యత్తులో వీడు ఎలా పైకొస్తాడు! అదేదే నా చింత''. కొంతకాలానికి పెద్దవాడు హైకోర్టు జడ్జి అయినాడు. ఆయనని కల్సుకోవడానికి వచ్చినవారంతా ఆయనకి నమస్కరిస్తూ వచ్చారు. చిన్నప్పుడు ఆయన తన తల్లిదండ్రులకు నమస్కరించిన ఫలితం అది. ఇంక రెండవవాడు అదే కోర్టులో ప్యూనుగా చేరాడు. చిన్నప్పుడు తన తల్లిదండ్రులకు నమస్కరించనందువల్ల పెద్దవాడయ్యాక తానే అందరికి నమస్కారాలు పెడుతూ జీవితాన్ని గడుపవలసివచ్చింది. ఇదే రియాక్షన్. ఎవరికైనా ఇది తప్పదు.

భారతయుద్ధం ముగిసిన తరువాత గాంధారి కృష్ణునితో, ''కృష్ణా! నూర్గురు నా బిడ్డలు నశించారు!'' అని నిష్ఠూరంగా పలికింది. అప్పుడు కృష్ణుడు, ''గాంధారీ! నీ వంశంలో నీ కుమారులు నూర్గురున్నారు! వారు ఎప్పుడైనా నీ మాట చెవిన పెట్టినారా? నీ దృష్టికే నోచుకోని నీ కుమారులు భగవంతుని దృష్టికి సరిగా నోచుకోగలరు?'' అన్నాడు. తల్లిదండ్రుల ప్రేమకు నోచుకోనివారు దైవప్రేమను పొందలేరు. ఇదే రామాయణం కూడా బోధిస్తున్నది. అవతారపురుషుడైన శ్రీరామచంద్రుడినే ఎదిరించి జయించి తమ ధనుర్విద్యాప్రావీణ్యంతో ఆశ్చర్యపరిచినవారు కుశలవులు. వారి కెక్కడి నుంచి వచ్చింది శక్తి? ఆ తల్లికి చేసిన సేవలు అటువంటి వారిని అంతటివారిగా తీర్చిదిద్దినవి. కనుక తల్లిదండ్రులను సేవించాలి, వారి ప్రేమను సంపూర్ణముగా పొందాలి. నీ తల్లిదండ్రులకు ఏది ఇష్టమో నీకు తెలుసు; ఏది చేస్తే వారు సంతోషిస్తారో నీకు తెలుసు. వారిని సంతోషపెట్టలేక, సంతృప్తిపర్చక నీకు తెలియని భగవంతుణ్ణి ఎలా సంతోషపెట్టగలవు? భగవంతునికి ఏది చేస్తే సంతృప్తి కల్గుతుందో నీకు తెలియదు కదా! కనుక తల్లిదండ్రులే ప్రత్యక్ష దైవాలు. Parents అంటే "Pay" "rent" అన్నమాట. దేహమనే ఇల్లు ఇచ్చినందులకు తల్లిదండ్రులకు Rent (అద్దె) చెల్లించాలి. అనగా వారిని సంతోషపెట్టాలి, వారికి సేవ చేయాలి.

(సశేషం)

## 'చేయూతనీయుమా - శ్రీ సత్యసాయి!'

పుట్టపర్తిని పుణ్యభూమిగా మార్చి
ఈశ్వరాంబకు పుట్టి ఈశ్వరాంశమున
ప్రజ్ఞాన బ్రహ్మమై భాసించు స్వామి!
చేయూతనీయుమా - శ్రీ సత్యసాయి!

విద్యవైద్యము లేవి వెలకు అమ్మరాదు
సేవలోనే నీదు జీవితము గడుపు
అనుచు బోధించి నీవాచరించెదవు
శ్రీ సత్యసాయీశ! చేయూత నిమ్ము

ఏ భాషలోనైన ఎచట పిల్చినను
భక్తులను కాపాడ - ప్రత్యక్ష మగుచు
'నేనుండగా భయము నీకేందు' కనెడు
సాయిరామా! నాకు చేయూత నిమ్ము

వాచాలుడై మూగవాడు మాట్లాడు
కుంటివాడెన్నియో కొండలన్ దాటు
లేదు అసాధ్యమ్ము నీదు కృప గలుగ
చేయూతనీయుమా! శ్రీ సత్యసాయి!

వై. వేం. రామబ్రహ్మశాస్త్రి (హైదరాబాదు)

# SRI SATHYA SAI INSTITUTE OF HIGHER LEARNING

**(Deemed University)**



Prasanthinilayam - 515 134 (A.P) Phone: (08555) 87239 - Grams: 'SAINSTITUT'

## ADMISSION NOTICE

**Admission for the Academic Year commencing from May/June 1998 will be made for the following Courses**

**Prasanthinilayam Campus (Only for Men)** B.A., B.Sc. (Hons) in Mathematics, Physics, Chemistry, Biosciences & Economics, M.B.A., M.F.M. (Master of Financial Management), M.Tech. (Computer Science).

**Brindavan Campus (Only for Men):** B.Sc.(Hons) in Mathematics, Physics, Chemistry & Biosciences and B.Com. (Hons).

**Anantapur Campus (Only for Women):** B.A., B.Sc.(Home Science), B.Sc (Hons) in Mathematics, Physics, Chemistry, Botany & Zoology, B.Com.(Hons.), M.A. (English), M.A. (Telugu), M.Sc. (Home Science) and B.Ed.

**Eligibility for Admission (For Under Graduate Courses):** 10+2 pattern of study / Intermediate

Minimum marks required in the X Std. examination is 60% in the aggregate and 55% in General English. They should have taken their final year +2 / Intermediate qualifying examination before the date of Admission Test.

**Eligibility for Admission (For Post-Graduate Courses including M.B.A.,M.F.M., and B.Ed.):** 10+2+3 pattern of study

**Post Graduate** : First class (a minimum of 60% marks in aggregate in all the three years of study) in respective degrees with 50% in General English.

**M.B.A./M.F.M. and B.Ed.**. First class (a minimum of 60% marks in all examinations of the course) in any first degree or Post-Graduate degree with 50% of marks in General English in the first basic degree. The minimum requirement of 50% of marks in General English is exempted for candidates of Technical Courses like - B.E. B.Tech. B.Pharma., B.Sc.(Agri) etc for M.B.A./M.F.M. Candidates

**Eligibility for Admission (For M.Tech. Computer Science):** First class (60% and above) both in the first degree and M.Sc.(Mathematics) / M.Sc (Physics) / M.Sc.(Computer Science) / B.E. / B.Tech levels of examination with Computer Science as background.

In the case of candidates who have not received the marks statements of the final year of the first degree examination, their marks in the previous years/semesters should be 60% in aggregate and 50% in General English. They should have taken their final year/semester qualifying examination before the date of the admission test.

Admission to all the above Courses will be on the basis of Admission Test and Interview which will be held, in May 1998, at PRASANTHINILAYAM, A.P.

Application form along with Information Handbook will be available from **November 25th, 1997** to **February 20th, 1998.**

Interested candidates may apply to the Registrar, **SRI SATHYA SAI INSTITUTE OF HIGHER LEARNING**, Prasanthinilayam 515134, Anantapur Dt., A.P. along with I.P.O or Bank Draft for Rs. 50/- for Undergraduate Courses and Rs.70/- for Post Graduate Courses/M.B.A./M.F.M./M.Tech.(Computer Science)/B.Ed. Courses. The draft should be drawn in favour of **SRI SATHYA SAI INSTITUTE OF HIGHER LEARNING** payable at **Prasanthinilayam.**

Since the application-forms are different for each programme, candidates must indicate in the requisition letter the details of course/subject of study for which they seek admission. Also, the name and postal address of the candidate should clearly be mentioned in the requisition.

**REGISTRAR**

